ఆలీపూరు కుట్ర కేసు విచారణ సందర్భంలో శ్రీ అరవిందుల పక్షాన వాదిస్తూ ఆయన దేశభక్త ప్రబోధక కవి అనీ, జాతీయవాద ప్రవక్త అనీ, మానవహితవాది అనీ చిత్తరంజన్ దాసు పేర్కొన్నారు. శ్రీ అరవిందులది బహుముఖమైన ప్రతిభ. అయినప్పటికీ శ్రీ మనోజ్ దాస్ ఈ మూడు అంశాలను గురించి తమ రచనలో ప్రముఖంగా వివరించారు. ఆలీపూరు కుట్ర కేసు విచారణ తర్వాత, కారాగార విముక్తులైన శ్రీ అరవిందులు పుదుచ్చేరి చేరుకుని యోగసాధనలో నిమగ్నులైనారు. తత్ఫలితంగా ఆయన తన భవిష్యత్ దర్శనాన్ని 'దివ్యజీవనం' లోనూ ప్రతీక కావ్యమైన 'సావిత్రి' లోనూ ఆవిష్కరించారు. శ్రీ అరవిందుల జీవితంలో తరువాతిదీ విశిష్టమైనదీ అయిన యీ దశనుగురించి కూడా శ్రీమనోజ్ దాస్ వివరించారు. కాగా, ప్రముఖ భారతీయ సాహిత్య నిర్మాతలలోనూ నవభారత నిర్మాతలలోనూ ఒకరైన శ్రీ అరవిందులను గురించి ఎన్నో విషయాలు తెలుసుకోడానికి ఈ పుస్తకం తోడ్పడగలదు.

**వెల : రూ. 2-50**

**ముఖ పత్రం : సత్యజిత్ రే**

**రేఖా చిత్రం : పుదుచ్చేరి, అరోవిల్**

**బ్లాకులు తయారుచేసే విభాగం**

భారతీయ సాహిత్య నిర్మాతలు

# శ్రీ అరవిందులు


రచన.

మనోజ్ దాస్

అనువాదము :

అమరేంద్ర

(డాక్టర్ చతుర్వేదుల నరసింహశాస్త్రి)





సాహిత్య అకాడెమీ

న్యూఢిల్లీ

SRI ARAVINDULU —
Telugu translation by C. Narasimha Sastri 'Amarendra' of Manoj Das' original monograph in English entitled SRI AUROBINDO. Sahitya Akademi New Delhi, 1977.
Price Rs. 2-50


*First Edition : 1977*

*Available from :*

SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1
*Regional offices :*
Madras-6, Calcutta-29 & Bombay-14

Published by Sahitya Akademi and Printed at
Weldun Press, 7/1, Mannappa Mudali St., Madras-21.

# విషయసూచిక



## అనుబంధాలు




శ్రీ అరవిందుని కృతులకు సంబంధించిన అన్ని హక్కులూ పుదుచ్చేరిలోని శ్రీ అరవిందాశ్రమం ట్రస్టు వారివే. శ్రీ అరవిందుని గద్య పద్య కృతుల నుంచి కొన్ని భాగములనూ, కొన్నిటిని పూర్తిగానూ వాడుకొనుటకు దయతో అనుమతించిన ట్రస్టువారికి మా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

# మొదటి ప్రకరణం

ఒక సముదాత్త ఆత్మలో స్వప్నమై
మానవుని జిజ్ఞాసను కలవరపరిచే భ్రాంతియై
అలరారిన నవ్యసృష్టి పురాతన వ్యవస్థనుంచి ప్రభవిస్తుంది.
శబ్దాతీతమైన జ్ఞానం భాషలో ఒదుగుతుంది.
దళితమైన సౌందర్యం స్వర్గసుమాలలో వికసిస్తుంది.
ఖేదమోదములు కేవలానందంలో విలీనమౌతవి.
మానవాణి సత్యవాక్కును ప్రకటించే తరుణం.
చేతనావరణానికి ఆవల నిలిచిన శక్తి చైతన్యముపొంది
నేలమీద వెలిసే సమయం.
అనంతత్వపు అద్భుతాలకు కాలపురుష తాండవ కేళితో
లయకలిసే క్షణం.

శ్రీ అరవిందులు : సావిత్రి

## శైశవం.

"నలుగురి కళ్ళకూ నదరుగా కనబడే బాహ్యసన్నివేశాలు నా జీవితంలో ప్రధానమైనవి కావు. కాబట్టి నా జీవితచరిత్రను ఎవరూ రచించలేరు."

అరవిందుని జీవితకథ రాయాలని సంకల్పించిన శిష్యునికి ఆయన చేసిన హెచ్చరిక పై వాక్యం. ఈ హెచ్చరికను గమనించికూడా జీవితకథా రచనకు పూను కోవటం అనేది విరుద్ధంగా కనబడవచ్చు. రాయటం తప్పనిసరి కాబట్టి ఆయన తన జీవితాన్ని గురించి ఏ విధంగా భావించారో గ్రహించి రచనకు ఉపక్రమించటం శ్రేష్ఠమైన ద్వితీయ పంథా. సాహిత్యరంగంలో ఆయన సాధించిన విజయపరంపరలను ప్రదర్శించటం ప్రధాన లక్ష్యమైనప్పటికీ అరవిందుని జీవితంలో తారసిల్లిన సంఘటనల ప్రసక్తి రాకుండా వుండటానికి వీలులేదు.

బాహ్యదృష్టికి స్థూలంగా గోచరించే రాజకీయ సారస్వత సన్నివేశాలు ఉపరితలంలో అపరిమితంగా వున్నాయి. అవి ఒక పెద్ద గ్రంథానికి సరిపడిన సామగ్రి కాగలవు. భారత స్వాతంత్ర్య సంగ్రామరంగంలో ఆయన నిర్వహించిన భూమిక ఒక వీరగాథకు ఇతివృత్తం. ఆయన పోరాడిన మహాయుద్ధం చైతన్యసీమలలో సాగింది. ఆ గుహతర కురుక్షేత్ర సంగ్రామ రంగం ఆయన అంతరంగం. కాబట్టి దానిని విశదీకరించడం అసాధ్యం.

అరవిందుని సాహిత్యంలో అత్యధికభాగం మానవచైతన్యపు సాహస యాత్రకు సంబంధించింది. ఆ సాహసచర్యకు అక్షరాకారం. అందువల్లనే రచయితకు ఇష్టంలేకపోయినప్పటికీ అరవిందుల తాత్విక సిద్ధాంతాల ప్రసక్తి తీసుకురాక తప్పదు.

1872 వ సంవత్సరంలో ఆగస్టు మాసం పదిహేనవతేదీ శ్రీ అరవిందుని జననం. కలకత్తా నగరంలో థియేటరువీధిలో తండ్రి స్నేహితుడు మన్మోహన్ ఘోషు గారింట్లో పుట్టాడు. ఆయన తండ్రి డాక్టరు కృష్ణధన్ ఘోషు. తల్లి స్వర్ణలతా దేవి. ఆయన మాతామహుడు రాజనారాయణబోసు. ప్రజలు ఆయనను ఋషి రాజనారాయణ బోసు అని పిలిచేవారు. భారత జాతీయవాద పితామహుడని చరిత్రకారులు ఆయనను అభివర్ణించారు. ఆయన రవీంద్రుని తండ్రి దేవేంద్రనాథ ఠాకూరుకు సన్నిహిత మిత్రుడు. ఆయన తీవ్రమైన జాతీయవాది. రవీంద్రుని అన్న జ్యోతీంద్రనాద్ ఆయనకు అనుచరుడు. రాజనారాయణబోసు జాతీయభావ ప్రచారం కోసం స్థాపించిన ఒక రహస్యసంఘంలో చేరిన ప్రతిభావంతులైన యువకులలో రవీంద్రనాథ ఠాకూర్ కూడా సభ్యుడు.

ఋషి రాజనారాయణబోసు అభిప్రాయాలూ కార్యకలాపాలూ ఆయన అల్లుని మీద ఎటువంటి ప్రభావమూ ప్రసరించలేదు. కృష్ణధన్ ఘోషు పశ్చిమదేశాలనుంచి వైద్యశాస్త్రంలో పరమ పట్టభద్రుడై తిరిగివచ్చాడు. ఆయన మనస్సు పాశ్చాత్య నాగరికతకు పూర్తిగా వశమైపోయింది. తండ్రిగారి అసమానమైన ఆంగ్లభాషాభిమానపు బరువును అరవిందుడు పుట్టినప్పటినుంచీ మోయవలసి వచ్చింది. అరవింద అక్రాయిడ్ ఘోషు అని కుమారుడికి పేరు పెట్టాడు. అరవిందుడు జన్మించిన తరుణంలో ఇంగ్లండునుంచి మిస్ అక్రాయిడ్ అనే వనిత వచ్చివుండినందువల్ల ఆవిడ పేరును కూడా కృష్ణధన్ జోడించి వుండవచ్చు.

డార్జిలింగులో యూరోపియన్ల పిల్లల చదువుకోసం ఏర్పరిచిన లోరెటో కాన్వెంటు స్కూలులో అయిదోయేట అరవిందుడు వినయభూషణ్, మన్‌మోహను లనే అన్నలిద్దరితోపాటుగా చేరాడు. అరవిందుని జీవిత చరిత్రను తొలిసారిగా 1911 వ సంవత్సరంలో ఆర్. పి. పండిట్ రచించి డార్జిలింగులో అరవిందుని విద్యార్థి దశను గురించి ఈ విధంగా వర్ణించాడు. పాటిల్ కాని మరి ఒక అరవిందాభి మానికాని సేకరించిన అభిప్రాయాలూ, జ్ఞాపకాలూ ఈ వర్ణనకు ఆధారాలు కావచ్చు.

"అరవిందుని ఆంగ్లాధ్యాపకుడు బాల్యంలోనే ఆయన మహనీయతకు అంకు రములను గుర్తించగలిగాడు. అధ్యాపకు లందరికీ అత్యంత ప్రీతిపాత్రుడు అర విందుడు. పాఠాలను అవలీలగా ఆకళించుకునేవాడు. పాశ్చాత్య బాలకుల నడుమ ఏకాకిగా వుంటూ ప్రకృతి సుందరి రమణీయవదనమును అవలోకిస్తూ వుండేవాడు. గంభీరమైన, విషాదభరితమైన, ఆలోచనాపూర్వకమైన లోచనాలతో భవితవ్యంవైపు చూపులు సారించేవాడు. సరళ సౌమ్య స్వభావంతో, నిర్మలహృదయంతో అరవిం దుడు ఆ పాఠశాలకే ఆభరణంగా అలరారుతూ ఉండేవాడు.''

అక్కడ రెండేళ్లు మాత్రమే వున్నాడు. 1879 లో కృష్ణధన్ భార్యా, పుత్రులతో ఇంగ్లండు వెళ్ళాడు. మాంఛెస్టరు పట్టణంలో డ్రూవెట్ సతీమణి పరి రక్షణలో ముగ్గురు కుమారులను దిగబెట్టి కృష్ణధన్ దంపతులు స్వదేశానికి తిరిగి వచ్చారు అన్న లిద్దరూ ఒక గ్రామరుస్కూలులో చేరారు. అరవిందుడు డ్రూవెట్ సతీమణి కుమారుని దగ్గర ప్రత్యేకంగా చదువు సాగించాడు. డ్రూవెట్ లాటిన్ భాషలో ఆరితేరిన విద్వాంసుడు.

1885 వ సంవత్సరంలో సోదరులు ముగ్గురూ లండనుకు మకాం మార్చు కున్నారు. డ్రూవెట్ సతీమణి వాళ్ళకు సంరక్షకురాలు. ఇంగ్లండులో నివసించే భారతీయులతో తన కుమారులకు సాంగత్యం కలగకుండా చూడవలసిందని డాక్టరు ఘోషు డ్రూవెట్ సతీమణికీ, పుత్రునికీ ఆదేశాలు ఇచ్చారు. డాక్టరు ఘోషుకూ, డ్రూవెట్ కుటుంబానికి ఇంగ్లండులో వున్న మిత్రులతోనే పిల్లలకు సంబంధం, స్నేహం ఏర్పడ్డాయి. సమ వయస్కులైన ఆంగ్లబాలకులతో వాళ్లు స్నేహం చేసు కున్నారు. తన మిత్రమండలిలో మన్‌మోహను కవిగా పేరుతెచ్చుకున్నాడు. ఆస్కారు వైల్డు, లారెన్సు చిన్యనూ ఆయనకు మిత్రులైనారు.

సంస్కృతిలోనూ, ప్రవర్తనలోనూ, విద్యలోనూ తన బిడ్డలు పూర్తిగా ఆంగ్లేయ విధానం అనుసరించాలని కృష్ణధన్ ఆశయం. కాని మతం విషయంలో

పిల్లలు పెద్దవారైనాక ఇష్టప్రకారం విశ్వాసాలను ఏర్పరుచుకోవచ్చునని ఆయన ఉద్దేశం. కాని డ్రూవెట్ సతీమణికి క్రైస్తవ మతాభిమానం జాస్తి. అందువల్ల వాళ్లు పెద్దవారయేదాకా వేచివుండే ఓర్పు కొరవడింది. ఒక వినోదకరమైన సంఘటన అరవిందుని స్మృతిపథంలో నిలిచి వుంది

“మేము ఇంగ్లండులో వున్నప్పుడు కంబర్లాండులో నాన్‌కన్ఫర్మిస్టు ప్రబోధకుల సమావేశం జరిగింది. వృద్ధవనిత డ్రూవెట్ సతీమణి నన్ను అక్కడికి తీసుకు వెళ్ళింది. ఆవిడ మాకు సంరక్షకురాలు. ప్రార్థనలు ముగిసిన పిదప అంతా వెళ్ళిపోయారు. కొంతమంది గాఢభక్తి కలవారు వుండిపోయారు. అప్పుడు మతావలంబన జరుగుతుంది. ఆ కార్యకలాపంతో నేమ పూర్తిగా విసిగిపోయారు. అప్పుడొక ప్రబోధకుడు నా దగ్గరికి వచ్చి కొన్ని ప్రశ్నలు వేశాడు. నేను ఏమీ బదులు చెప్పలేదు. అప్పుడు వాళ్లు “ఈ బాలుడు రక్షింపబడినాడు” అంటూ బిగ్గరగా కేకలు వేశారు. నా పక్షాన ప్రార్థనలు జరిపి దేవునికి ధన్యవాదాలు చెప్పారు. నాకు ఏమీ అర్థంకాలేదు. నాకు ప్రార్థనచేసే అలవాటు లేదు. అయినప్పటికీ చిన్నపిల్లలు నిద్రపోయే ముందు ప్రార్థనలు చేసే విధంగా లాంఛనంగా చేశాను. అప్పటికి నాకు పదేళ్లు.”

లండనులో ఉన్న సెయింటుపాల్సు స్కూలులో శ్రీ అరవిందుడు 1884లో చేరాడు. లాటిను భాషలో ఆయన పాండిత్యానికి అధ్యాపకుడు ముగ్ధుడైపోయాడు. గ్రీకుభాషలోకూడా సమానమైన ప్రావీణ్యం అరవిందునికి అలవరచటానికి ఆయన ప్రత్యేకంగా శ్రద్ధ వహించాడు.

సెయింటు పాల్సు స్కూలులో చదివిన అయిదేళ్ళూ అరవిందుడు ప్రతిభావంతుడైన విద్యార్థిగా ప్రకాశించాడు. సాహిత్యంలోనూ, చరిత్రలోనూ ఉత్తమ బహుమతులు సంపాదించాడు. పై తరగతులకు త్వరితంగా ఆయన ఉత్తీర్ణుడైనాడు.

మాంచెస్టరులో వున్న తరుణంలో చాలా చిన్నవయసులో అరవిందుడు కవిత్వ రచన ప్రారంభించాడు. ఆ నగరంలో వెలువడే ఫాక్సు కుటుంబ పత్రికలో ఆ కిశోర రచనలు ప్రకటించారు. అప్పుడు ఆయనకు సుమారు పదేళ్ళ వయస్సు.

ఆయన విద్యావ్యాసంగమూ, స్వతంత్రరచనాకలాపమూ లండను నగరంలో ముమ్మరంగా సాగినవి. ఆ కాలంలో ఆయన చేసిన రచనలు చాలాభాగం నష్టమై

పోయాయి. కాని లభించిన కొన్ని రచనలవల్ల ఆయన తీవ్రకవితాభావన ఛందస్సులతో గాఢమైన, సహజమైన పరిజ్ఞానమూ వెల్లడి అవుతున్నాయి. "అన్న చింతా చమత్కార కాతరే కవితా మతహః?" అని కాళిదాసు చెప్పినట్లు కొందరు అంటారు. కాని ఈ వాక్యం అరవిందుని పట్ల వర్తించదు. లోపలినుంచి కవితావేశం ఉప్పొంగి వస్తున్న తరుణంలో ఆయన చుట్టూ దరిద్రదేవత అవలింతలే పరిహాసం చేసేవి. డాక్టరు కృష్ణధన్ దయాగుణశోభితుడు పరోపకారి అయినప్పటికీ ఆయన వడవడిలో విలకడ లేదు ఖుల్నా రంగపూరు వంటి నగరాలలో సివిలుసర్జన్‌గా పనిచేస్తున్నప్పుడు ఆయన ధర్మదాతగా పేరుమోశాడు. పేదలు ఆయనను ఆశ్రయించేవారు. ధనికులు ఆయనకు మిత్రులైనారు. ఆయన భవనం పేరు సూయజ్ కాలువ. అక్కడ మేధావంతులైన భారతీయులూ, పాశ్చాత్యులూ సమావేశమవుతుండేవారు. కాని అధికవ్యయానికి అలవాటుపడిన డాక్టరు ఘోషు తన కుమారులను మాంఛెస్టరు నగరంలో వదిలివచ్చినప్పటి మంచీ వాళ్ళకు డబ్బు సమకూర్చే బాధ్యతను సవ్యంగా నిర్వర్తించక కఠినత్వం ప్రదర్శించాడు కుమారులు లండను చేరుకున్నాక వాళ్ళకు డబ్బు పంపాలనే ఆలోచనే లేనట్లు ప్రవర్తించాడు. కాని బిడ్డలు ధైర్యంగా దినాలు గడుపుకున్నారు. ఆ తరుణాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ అరవిందుడు ఇల్లా అన్నాడు: "ఒక ఏడాదిపాటు ఒకటి రెండు సాండ్విచ్చులూ, వెన్నారొట్టే పొద్దున మా భోజనం. సాయంకాలం వేళ ఒక పెన్నీ విలువచేసే ఎండబెట్టిన తినుబండారం."

ఒక రోజున మన్‌మోహను నాస్తికాభిప్రాయం ప్రకటించగా విని డ్రూవెట్ సతీమణి విశ్వేష్టురాలైపోయింది. ఆ విధంగా దైవనింద చేసే వాళ్ళ నెత్తిమీద ఇంటికప్పు కూలిపడుతుందనే భయంతోచి తనని రక్షించుకోదలచి ఇల్లు మార్చుకున్నది. ఆ తరవాత అన్నదమ్ములు మూడుసార్లు ఇళ్లు మార్చుకోవలసి వచ్చింది.

1889 వ సంవత్సరం చివరికి అరవిందుడు కేంబ్రిజ్ విశ్వవిద్యాలయానుబంధమైన కింగ్సు కాలేజీలో చేరాడు. సెయింటుపాల్సు స్కూలులో లభించిన స్కాలర్‌షిప్పు సహాయపడింది. కొద్దికాలానికే గ్రీకు, లాటిను భాషల్లో బహుమతులన్నీ గెలుచుకుని కళాశాలాధ్యాపకుల ప్రశంసలూ, సహాధ్యాయుల మన్ననలూ సంపాదించాడు రెండోయేట చివర క్లాసికల్ ట్రిపాసు పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు.

తండ్రిగారి గాఢమైన అభిలాషకు అనుగుణంగా అరవిందుడు ఇండియన్ సివిలు సర్వీసులో అభ్యర్థిగా చేరాడు. సామాన్యంగా అటువంటి విద్యార్థులు ట్యూటర్ల దగ్గర శిక్షణ పొందుతారు. ఆర్థికంగా స్తోమతు లేనందువల్ల ఆయన స్వయంగా చదువుకుని లిఖితపరీక్ష లన్నిటిలోనూ చాలా మంచి మార్కులు తెచ్చుకున్నాడు ఆశ్వక పరీక్షకు మాత్రం హాజరుకాకుండా ఒంటరి మబ్బులాగా తేలిపోయాడు. నాలుగుసార్లు పరీక్షకు ఏర్పాట్లు జరిపినప్పటికీ ఆయన తప్పించుకున్నాడు.

చాలాకాలం తరవాత తను పరీక్షకు హాజరుకాకపోవటానికి కారణం ఏమిటో వివరించాడు. I. C. S. లో చేరాలనే అభిలాష లేదు. ఆ బంధంనుంచి తప్పించుకునే మార్గం ఏదని అన్వేషిస్తున్నాడు. తనంతట తాను నిరాకరిస్తే తల్లిదండ్రులు మనస్సులో బాధపడతారు. కనక I. C. S. పరీక్షాధికారులే తనను నిరాకరించే విధంగా తెలివైన పన్నాగం చేశాడు.

# రెండో ప్రకరణం

సరస్వతి తన కమల స్వర్గం నుంచి
చిరంతన హిమసీమలకు ఆహ్వానించింది
దక్షిణ సాగర తీరాలకు సాగే గంగానది
ఈడెన్ సుమవన ప్రసూనాలను వక్షానధరించిన గంగ
నన్ను ఆహ్వానించింది.

(భారతదేశానికి తరలివచ్చే తరుణంలో అరవిందుడు రచించినది)

## తొలినాళ్ల ప్రేరణలు

"అరవిందుడు తన వంతు బాధ్యతను చాలా ప్రశంసనీయంగా నిర్వర్తించాడు. రెండవ సంవత్సరం చివర క్లాసికల్ ట్రైపాసు మొదటిభాగంలో ప్రథమ శ్రేణిలో ఉన్నతస్థానం సంపాదించాడు. ఆంగ్లభాషలో పాండిత్యమూ సాహిత్య ప్రతిభా ప్రదర్శించి కళాశాలలో కొన్ని బహుమతులు గెలుచుకున్నాడు. మామూలుగా అండర్ గ్రాడ్యుయేట్ ఇటువంటి ఘనవిజయం సాధించటం గణనీయం. దానితో పాటుగా ఐ.సీ.యస్. పరీక్షకు సిద్ధంకావటం అసాధారణమైన కృషికీ సామర్థ్యానికీ నిదర్శనం. క్లాసికల్ భాషలలో పాండిత్యంతోపాటు మామూలుగా తన తరగతి విద్యార్థులలో కనబడనంతటి ఆంగ్లసాహిత్యాభినివేశం అరవిందునికి వుండేది. ఆంగ్లేయ యువకులలో ఎంతోమందికంటే చక్కటి ఆంగ్లభాషారచన చేసేవాడు."
(నవంబరు 20, 1892)

పై పంక్తులు కింగ్సు కళాశాలలో అరవిందుని అధ్యాపకుడు జి. దబ్ల్యు. ప్రొథిరో జేమ్సుకాటనుకు రాసిన ఉత్తరంలోనిది. అరవిందుని తండ్రికి స్నేహితు డైన సర్ హెన్రీకాటన్‌కు సోదరుడు జేమ్సుకాటన్. గుఱ్ఱపుస్వారీ పరీక్షకు హాజరు కాలేదనే మిషతో ఐ.సీ.యస్.లో చేరకుండా చేయటం అన్యాయమనీ, ఏవిధంగానైనా దానిని విరోధించాలనే వుద్దేశంతో ఈ వుత్తరం రాయటం జరిగింది.

ప్రోథిరో, కాటన్ ప్రభృతుల ప్రయత్నాలు విఫలంకాక తప్పని సన్నివేశాలు జరిగినవి. కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో భారతీయ విద్యార్థులసంఘం ఇండియన్ మజ్లీస్. అందులో సభ్యుడుగానూ తరవాత కార్యదర్శిగానూ అరవిందుడు భారత దేశంలోని ఆంగ్లపరిపాలనను ఖండిస్తూ విప్లవకరమైన ప్రసంగాలు చేశాడు. ఈ విషయం ఐ.సి.యస్. పరీక్షాధికారుల దృష్టికి వచ్చినట్లు తరవాత తెలిసింది. అందువల్లనే అశ్వికపరీక్షలో ఉత్తీర్ణుడుకాని అరవిందునిపట్ల ఉదారవైఖరి ప్రదర్శించటం మంచిదికాదని అధికారులు భావించి వుంటారు. కొన్ని సందర్భాలలో ఐ.సి.యస్.కు ఎన్నికైనవారికి భారతదేశం వెళ్ళి గుఱ్ఱపుస్వారీ తరిఫీదుపొంది పరీక్షకువెళ్ళే సదుపాయం కలిగించారు. అటువంటి సౌకర్యం అరవిందునికి అనుమతించలేదు.

భారతదేశంలో ఆంగ్లేయుల విధానాలుచూసి డాక్టర్ కృష్ణధన్ క్రమంగా నిరాశచెందాడు. తండ్రిలోవచ్చిన మార్పువల్ల అరవిందునికి తీవ్రమైన ఆంగ్లపరిపాలక నిరసన అలవడింది. భారతీయులపట్ల బ్రిటిషు పరిపాలకుల వైఖరిని అభిశంసిస్తూ వాళ్ళ హృదయరహిత నిరాదరణను నిరూపించే పత్రికా రచనలను జత పరుస్తూ ఉత్తరాలు రాసేవాడు. పదకొండు సంవత్సరాలప్రాయం వచ్చేసరికి విప్లవాత్మక పరిణామాలతో కూడిన మహాసంచలనం ప్రపంచంలో రాబోతున్నదనే అభిప్రాయం అరవిందునికి కలిగింది. ఆ మహాపరిణామంలో తాను ఒక ప్రముఖ భూమిక వహించటం దైవనిర్ణయమనే భావం మనసులో నాటుకున్నది.

ఐర్లండుదేశానికి చెందిన చార్లెసుపార్నెలును ప్రశంసిస్తూ 1891 లో రాసిన పంక్తులు చదివితే దేశస్వాతంత్ర్య సమరంలో పాల్గొనటం మహత్తరంగా అరవిందుని తరుణహృదయం భావించినట్లు స్పష్టం కాగలదు.

“ఓ తరళతారకా! మార్గదర్శకా!
ముక్తిదాయకా! పరిపాలక సింహస్వప్నమా!
కరవాలములను సిగ్గిలజేసే అపూర్వ నిస్త్రింశధారతో
సురిగిపోయారు దురాత్ములు.
వీరాగ్రేసరా! నీ జీవితమొక విషాదగాథ
ధరాగర్భంలో నరుడవై జన్మించి అస్తమించావు కద!”

అరవిందుడు 18-'0 సంవత్సరాల నడుమ రచించిన కవితలలో ఇదొకటి ఇటువంటివి మరికొన్ని సంకలనంచేసి 1895 లో బరోడాలో ప్రచురించారు. వీటిని పరిమిత పఠనంకోసం ఉద్దేశించి కొద్దిప్రతులే వేశారు. “సాంగ్స్ టూ మిర్టిలా” అని దాని శీర్షిక.

ఈ తరుణ రచనల్లో జీవితంపట్ల అనురక్తి వెల్లివిరిసింది. ఈ సంకలనంలో గ్లాకస్, ఈథన్ అనే పాత్రలు విశ్వజీవన విభిన్నతను ఈ విధంగా విశదీకరించారు

గ్లాకస్ అంటున్నాడు :

ఎంత హాయి!
ఇంత తీయని చల్లని రేయి
తపించే పిపాసువులకు శీతలవాహిని
ఈ రజని ఏకాంత ప్రశాంత హృదయమోహిని
పూలన్నీ తలవంచి నిదురించేవేళ
తళుకుల మిణుగురులుగా వెన్నెల వాగులు
మసకదారుల్లో వనసీమల గుసగుసలాడే రేయి
ఎంత హాయి, ఎంత హాయి!

ఈథన్ ప్రత్యుత్తరం.

ప్రభాతం మధురతరం, మనోహరం
నిశాదీపికలైన తారలు ఆరిపోయాయి.
శిశిర శీతలతల్పాలు వీడి
స్నిగ్ధ సుమసుందరులు ఓరకనులతో
        నిద్రలేచేవేళ

గ్లాకస్ ప్రస్తుతిస్తాడు ధాత్రిని :

ఓ ధరణీ ప్రియజననీ!
ఓ విచిత్ర సంతానమోహినీ!
వానంత సమీర మాలలు రుధిరజ్వాలలై నవా
గులాబి బాలల గుండియలోతులలో ?

ఈ ప్రాయంలో వెలసిన కవితలకు సుఖదుఃఖాత్మకమైన సృజన సుందర భావనలు ప్రేరకములు. ఐర్లండుదేశంలో సాగిన స్వాతంత్ర్యసమరం కూడా అరవిందునికి ఉద్దీపన కలిగించింది. అప్పటి రచనల్లో కొన్ని తావులలో సృష్టివిలాసం వెనుక ఒక క్రమగతివున్నదనే అవగాహన మెరుపులాగా తళుక్కుమంటుంది. గాఢమైన ఆభిజ్ఞానం కూడా కనబడుతుంది.

పరిపూర్ణమై నాలో నిరంతరమూ సంచలించే
హృదయాధినాయకా !
సముజ్జ్వల శేముషీవిలాస శంపాలతల దీప్తితో
లోకాలకు ఆకారాలు తీర్చిదిద్దుతూ
శబల వర్ణాంచల స్వర్ణవస్త్రావళిపై
భావనలకు అక్షరాకారం సంతరిస్తున్నావు.

భావావేశం మాత్రమేకాదు. సునిశిత మేధాశక్తిని ప్రకటించే తరుణ రచన ఒకటి ఇటీవలనే లభించింది. వద్దెనిమిదోయేట దీర్ఘసంవాదరూపంలో రచించిన ఈ ఖండికకు శీర్షిక "జీవన స్వరమేళ"

కేశవ : జీవితం అమూల్యం. నిర్వీరామ కార్యకలాపంతో దీనిని వ్యర్థం చేయరాదు. భోజనం కాగానే బద్ధకంగా కూర్చుని గడిపే క్షణాలు ఎంతో విలువైనవి. మిగిలిన పన్నెండు గంటల్లో విసుగుపుట్టించే కార్యకలాపాలన్నీ భరించి ఈ మధురక్షణాలకోసమే నిరీక్షిస్తూ వుంటాను.

విల్సను : నువ్వు పరస్పర వైరుధ్యాలకు మూర్తీభావానివి. అలసత్వాన్ని జీవిత పరమార్థమని ప్రశంసించటం నీకే చెల్లిపోతుంది.

కేశవ : జీవితానికి వేరొక ప్రయోజనం ఏముంది?

విల్సను : కర్తవ్యపాలనం అని ఉద్దేశం.

కేశవ : కర్తవ్య మనే మాటకు అర్థమేమిటో తెలుసుకుంటేకాని నీ అభిప్రాయాన్ని స్వీకరించి మన్నించలేను.

ఇద్దరి సంవాదమూ ఈ విధంగా కొనసాగుతూ వివేకపు వెలుగులో కర్తవ్యమూ, మతమూ, దైవమూ అనే వాటి స్వరూప నిరూపణ చేస్తుంది. సౌందర్యమూ, మాధుర్యమూ అనే పునాదులమీద వెలసిన సృష్టి స్వరూపాన్ని ఆవిష్కరించే ప్రతిభాభాసురమైన ప్రయత్నం ఈ రచన.

ఇంగ్లండులో గడిపిన పదునాలుగేళ్ళలో కడపటి కొన్ని నెలలు లండనులో ఉండి స్వదేశానికి వచ్చారు. ఆ సమయంలో కొందరు భారతీయ విద్యార్థులు లండనులో "పద్మమూ కులమూ" అనే పేరుతో ఒక రహస్యసంఘం స్థాపించారు. ఎవరి శక్తిని అనుసరించి వారు దేశ స్వాతంత్ర్య సంపాదనకోసం పాటుపడటానికి

ప్రమాణాలు చేశారు. వారిలో అరవిందుడు కూడా వున్నాడు. అప్పటి ఆయన ధీర వీర ప్రవృత్తిని ప్రొవింగు కవి ఇంకొక సందర్భాన రాసిన పంక్తులతో అభివర్ణించ వచ్చును.

> వెనుకకు తిరిగిచూడకుండా నిండు గుండెలతో ముందుకు సాగువాడు
> కారుమబ్బులు చెదిరిపోతాయని విశ్వసించేవాడు
> అధర్మం తాత్కాలికంగా పడగెత్తినా
> అంతిమ విజయం ధర్మానికి తప్పదని ఆశించేవాడు

ఆ సమయానికి బరోడా గైక్వారు మహారాజా శాయాజీరావు లండనుకు రావటం జరిగింది. అరవిందుని శ్రేయోభిలాషి కాటన్ మహాశయుడు వీ రిరువురికీ సమావేశం ఏర్పరిచాడు. బరోడా సంస్థానంలో అరవిందునికి ఉద్యోగం లభించింది.

1893 వ సంవత్సరంలో రెండు చరిత్ర ప్రసిద్ధములైన సాగరయాత్రలు జరిగినవి భారతదేశంనుంచి పాశ్చాత్యదేశాలకు సాగినయాత్ర ఒకటీ, పశ్చిమదేశాల నుంచి భారతవర్షానికి తరలినది మరొకటి. భారతదేశపు ఆధ్యాత్మిక సందేశాన్ని పాశ్చాత్యులకు అందించటానికి వివేకానందస్వామి బయలుదేరిన సంవత్సరం అది. ఆ సంవత్సరమే అరవిందుడు భారతదేశానికి మరలివచ్చాడు శతాబ్దాల నిద్రావస్థ నుంచి మేలుకొలపటం కోసం

# మూడో ప్రకరణం

నవ్యసృష్టి వదన శోభలతో భవ్యప్రభాతం
ఉజ్జ్వలతర రవికాంతులతో ఆనందగగనాల భాసిస్తూ
విచ్చేసింది వింతసోయగాలతో నిండి
అనాది కాలపు ఆదిమ మూలాల నుండి
కొత్తగా వేళ్లు నాటుకుంటున్న పురాతన కాంతులతో

శ్రీ అరవిందులు : సావిత్రి

## సాహిత్య ఆధ్యాత్మిక రంగాలలో సాధనారంభం

1893 వ సంవత్సరారంభంలో బొంబాయిలోని ఎపోలోబందరులో అరవిందుడు అడుగుపెట్టాడు ఆయన స్వదేశాగమనం నిశ్శబ్దంగా నిరాడంబరంగా జరిగివుంటుంది. ఎవరూ స్వాగతం పలకటానికి ఎదురువెళ్ళలేదు. భారతవర్షపు ఆత్మయే ఆయనకు మౌనంగా స్వాగతం పలికినట్లనిపించినప్పుడు ఇంక ఇతర వన్నాహాలెందుకు ? అనంతరకాలంలో ఒక శిష్యునికి రాసిన లేఖలో భారతదేశంలో పాదంమోపిన క్షణంలో ఒక మహాప్రశాంతి ఆయన మనస్సును ఆవరించినట్లు వర్ణించారు.

భారత భూమి మీద ఎపోలోబందరులో పాదంపెట్టిన క్షణం నుంచీ ఆధ్యాత్మికానుభూతులు కలుగుతూవచ్చాయి. ఈ లోకానికి అతీతమైన అనుభూతులుకావు ఈ లోకపుసత్యాన్ని మరింత సార్థకంచేసేవి. అంతరాంతరాలలోనివి. ఈ భౌతిక వస్తువులన్నిటినీ ఒక అనంతశక్తి ఆవహించినట్లు స్థూలమైన పదార్థాలన్నిటినీ పరమార్థం పరివ్యాప్తమై సార్థకంచేస్తున్నట్లు గాఢమైన అనుభూతి కలిగింది. అదే సమయంలో భౌతికపరిథిని అదిగమించి ఆధ్యాత్మిక భూమికలను అందుకుంటున్నట్లు తోచేది. భౌతికవస్తువులకు అతీతమైన ఆ ప్రభావాలు వాస్తవ విషయాలమీద ప్రసరిస్తున్నట్లుగా తోచేది.

అరవిందుని ఆగమనానికి ముందుగా ఒక విషాదసంఘటన జరిగింది. ఆయన ఎక్కవలసిన ఓడ లిస్బనులో మునిగిపోయింది. డాక్టర్ కృష్ణధన్‌కు ఆ వార్త

చేరింది. చివరి క్షణంలో అరవిందుడు ఇంకొక ఓడ ఎక్కినట్లు తండ్రికితెలిపే అవకాశం లేకపోయింది.

ఓడ మునిగినట్లు వినగానే కృష్ణధన్‌కు గుండెపోటువచ్చింది అరవిందో అని కలవరించి కొన్ని దినాలకు గతించాడు. అప్పటికి కొన్ని సంవత్సరాల కిందటే తల్లి స్వర్ణలతాదేవికి మతిభ్రమణం కలిగింది. దేవఘర్‌లో తండ్రి యింట్లో వుంటున్నది. అటువంటి స్థితిలో తల్లిని చూడటానికి మనసొప్పక సూటిగా బరోడావెళ్లాడు. తరవాత కొన్నాళ్ళకు తల్లిని కలుసుకున్నాడు. "నువ్వు ఎవరివో? నా అరవింద చంటివాడు" అందట. నీ కొడుకే పెరిగిపెద్దవాడై వచ్చాడని ఎంతచెప్పినా నమ్మలేదు. తన కొడుకు వేలిమీద ఒక గుర్తు వుండాలన్నది ఆ గుర్తు చూపిన తరవాతనే ఆయన తన కుమారుడని ఒప్పుకున్నది.

ఆయన బరోడాలో భూమి పరిష్కారశాఖ, రివిన్యూవంటి కొన్ని విభాగాలలో పనిచేసిన తరవాత మహారాజ కళాశాలలో ఆంగ్లభాషాచార్యుడుగా నియమింపబడ్డాడు. ఫ్రెంచిభాషకూడా కొన్ని తరగతులకు బోధించాడు. అప్పుడు అరవిందుని విద్యార్థిగావుండి తరవాత బరోడాలో న్యాయవాదవృత్తి చేపట్టిన ఆర్.ఎన్. పట్కార్ జ్ఞాపకాలు ఇల్లా వున్నాయి. "ఇంటర్మీడియట్ క్లాసులో ఆయన విద్యార్థిని కాగలిగే భాగ్యం నాకు పట్టింది. ఆయన బోధనావిధానం సరికొత్తగా వుండేది. క్లాసు పాఠాలకంటే ఆయన బహిరంగోపన్యాసాలు వీనులవిందులుగా తోచేవి. అప్పుడప్పుడు కాలేజిలో చర్చాసంఘ సమావేశాలకు అధ్యక్షత వహించేవాడు. ఆయన మాట్లాడే సమయానికి కాలేజి మధ్యభాగంలోవున్న హాలు క్రిక్కిరిసిపోయేది.ఆయనకు వాగ్ధార ఎక్కువలేకపోయినా ప్రసంగం చాలా ఉత్తేజకరంగా వుండేది. అంతా నిశ్శబ్దంగా పరవశులై చెవులొగ్గివినేవారు. ఆయన చేతులూ తలా కదపకుండా నిలబడేవాడు. ఆయన పెదవులనుంచి భాష ప్రవాహంలాగా ఎగసివచ్చేది. అప్రయత్నంగా అత్యంత మధురంగా సాగే ప్రసంగంవిని శ్రోతలు మంత్రముగ్ధులైపోయేవారు.

భారతదేశానికి తిరిగివచ్చిన వెంటనే ఆయన రాజకీయాలలో జోక్యం కల్పించుకున్నాడు. భారత రాజకీయాలను ఆకళించుకోటానికి ఎక్కువకాలం పట్టలేదు. అప్పటి రాజకీయాలు మితవాద నాయకులచేతుల్లో—కాదు మాటల్లో వుండేవి. భారతజాతీయ కాంగ్రెసు ఇంతపెద్ద దేశానికి నాయకత్వం వహించటానికి సమర్థంగాలేదు, బ్రిటిషు పరిపాలకులు ఏర్పరిచిన కట్టుదిట్టమైన పాలనాయంత్రాంగాన్ని కదిలించగల శక్తి అర్భకురాలు నాటి కాంగ్రెసు. దాని స్వరం బలహీనంగా వుండేది, దానిని పూర్తిగా

కుదిపివేయాలి. కొత్త ఆశయాలు అంకురింపజేయాలి. పోరాటం సాగించి సాధించ
వలసిన ఉన్నతలక్ష్యాలు ఏర్పరచాలి. ప్రజాబాహుళ్యమునంతనూ సమాశ్లేషం చేసుకో
గల విశాల ప్రాతిపదికలు కల్పించాలి. అప్పుడే కాంగ్రెసు సంస్థ స్వరాజ్యప్రాప్తికి
ఉపకరించగలదని ఆయన గ్రహించాడు.

తొలుత బొంబాయి నుంచి వెలువడే ఇందు ప్రకాశ పత్రికలో పేరులేకుండా
పాత దివ్వెలకు బదులు కొత్తదీపాలు అనే మకుటంతో వ్యాసపరంపర ప్రకటించాడు.
వీటిలో కాంగ్రెసు సంస్థను నిశితంగా విమర్శించాడు.

“కాంగ్రెసును గురించి నా అభిప్రాయం ఇది. ఆ సంస్థ లక్ష్యాలు లోపభూయిష్ట
ములు వాటిని సాధించటానికి అనుసరించే విధానాలలో చిత్తశుద్ధీ నిజాయితీలేవు.
ఎన్నుకున్న పద్ధతులు సరియైనవికావు. నాయకులని నమ్మినవారు సరియైన మనుషులు
కారు. ప్రస్తుతం మన పరిస్థితి ఎల్లావుందంటే గుడ్డివాళ్లు ఒక కన్నుగలవాళ్ళని
అనుసరిస్తున్నట్లుగా కనబడుతోంది.”

ఆ కాలపు పడకకుర్చీ రాజకీయనాయకులు ఈ వ్యాసపరంపర చదివి గగ్గోలు
పెట్టివుంటారు. అటువంటి రాజద్రోహపూరిత వ్యాసావళిని ప్రచురించటం విరమించ
వలసిందని అప్పటి ప్రసిద్ధ మహారాష్ట్రనాయకుడు పత్రికాధిపతులను కోరాడు.
సామాన్య విషయాలనుగురించి రాయవలసిందని సంపాదకుడు అరవిందుని బ్రతి
మాలుకున్నాడు. అందుకు అంగీకరించి రాజకీయ సిద్ధాంతాలనుగురించి మాత్రమే
వ్యాసాలు రాయటానికి ఉపక్రమించాడు. వాటిలో వాస్తవపరిస్థితుల ప్రసక్తివుండదు
కాని ఆవిధంగా ఎక్కువకాలం రచన సాగించటానికి ఉత్సాహం కలగలేదు.

అరవిందుని స్నేహితులు కొందరు దినేంద్రకుమార్‌రాయ్ అనే రచయితను
బరోడా పంపి అరవిందునికి వంగభాష మాట్లాడటం నేర్పించటానికి ఏర్పాటు
చేశారు. అరవిందునితో కూడా వుండేవాడు రాయ్. బరోడాలో గడిపిన దినాల జ్ఞాప
కాలు దినేంద్ర రచించాడు. అవి చాలా ఆసక్తికరంగా వుంటాయి. బరోడాలో
అరవిందుని జీవనవిధానాన్ని తెలిపే దృశ్యాలు అందులో కనిపిస్తాయి నిద్రాహారా
లనుకూడా లక్ష్యంచేయకుండా రాత్రి చాలా పొద్దుపోయేదాకా అరవిందుడు అధ్యయ
నంలో మునిగివుండేవాడు. దోమలు గుంపులుగా ముసురుతున్నప్పటికీ ఏకాగ్రతకు
భంగం కలిగేది కాదు.

తన పత్రాలనూ, ప్రసంగాలనూ అరవిందునిచేత గైక్వారు రాయించుకునే
వాడు అంతేకాక ఒకప్పుడు అరవిందునితో కాలక్షేపం చేయటం కోసం వాహనం

పంపించేవాడు. అరవిందుడు కొన్నిసార్లు వెళ్ళేవాడు. మరికొన్నిసార్లు నిరాకరించే వాడు. గైక్వారు దృష్టిలో పడటానికి అందరూ తహతహలాడుతుంటే చిక్కిన అవకాశాలనుకూడా అరవిందుడు ఎందుకు జారవిడుస్తున్నాడో రాయ్‌కి అర్థమయేది కాదు. అటువంటి అవకాశం దొరికితే ఇతరులు ఎగిరి గంతువేస్తారు కాని అర విందుడు చాలా ఉదాసీనంగా చూసేవాడు. సమాజంలో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవా లనే కాంక్షకూడా లేదు. ఆకర్షణీయములైన లక్షణా లెన్నో ఉన్నప్పటికీ బరోడా నగరంలో గొప్పవారి సమాజంలో స్థానం సంపాదించటానికి ఉత్సాహపడలేదు. ఈ విషయం గురించి రాయ్ ఒకసారి ప్రశ్నించాడు. అరవిందుడు ఒక్కవాక్యంలో బదులు చెప్పాడు. "అందులో నాకు ఆనందం గోచరించటం లేదు."

రాయ్ ఈ విధంగా అరవిందుని చిత్రించాడు "ఆయన ఒంటరిగా వుండే వాడు. విలాసాలకోసం వెంపరలాడటం ఎరుగడు. ఒక్కపైసాకూడా దుర్విని యోగం చేయడు. కాని నెల చివరికి ఆయన చేతిలో ఏమీ మిగిలేది కాదు."

తనకు ఏర్పడిన అభిప్రాయాలను రాయ్ ఈ విధంగా ఒక్కవాక్యంలో తేల్చి చెప్పాడు. "శ్రీ అరవిందుడు మర్త్యుడు కాడు. శాపగ్రస్తుడై ఈ భువిలో జన్మిం చిన దివిజుడు."

అరవిందుడు సంపాదించిన జీతమంతా ఏమైపోయేది? తరవాత ప్రకరణంలో దీనికి సమాధానం దొరుకుతుంది. ప్రస్తుతం బరోడాలో ఆయన ఆధ్యాత్మిక సార స్వత కార్యకలాపాలను గురించి తెలుసుకుందాము.

శ్రీ అరవిందునికి గుప్తవిద్యలమీద సహజమైన ఆసక్తి వున్నది. కాని 1904 వరకూ యోగాభ్యాసానికి ఉద్యమించలేదు కోరుకోకుండానే ఎన్నో సంద ర్భాలలో అద్భుతమైన అనుభవాలు కలుగుతూ వుండేవి. ఒకసారి బండీలో నగ రానికి వెళ్తుంటే అది తీవ్ర ప్రమాదంలో పడబోయింది. దానిని నివారించాలని ఆయన సంకల్పించగానే ఒక తేజోరాశి అక్కడ సాక్షాత్కరించి శకటాన్ని భద్రంగా కాపాడి సరియైన దారిలో నిలబెట్టింది.

శ్రీ అరవిందునికి కాళికాలయంలో ఇంకొక అనుభూతి కలిగింది. చాలా కాలం తరవాత కొందరు శిష్యులతో సంభాషిస్తూ అప్పటి అనుభూతిని ఈ విధంగా జ్ఞాపకం చేసుకున్నాడు:

"అప్పుడు పాశ్చాత్య సంస్కారంవల్ల నా బుద్ధికి దైవంమీద విశ్వాసం లేదు ఒకసారి చాందోడు సమీపానవున్న కర్నాం అనే వూరికి వెళ్ళాను. అక్కడ

చాలా ఆలయాలు ఉన్నాయి. అక్కడ కాళికాదేవాలయ మొకటున్నది. ప్రతిమను చూస్తుంటే దేవి నా ఎదుట నిలిచిన ట్లనిపించింది. మొట్టమొదటిసారి దైవ సాక్షాత్కారంవల్ల నాకు విశ్వాసం ఏర్పడింది" కొన్ని దశాబ్దాలు గడిచిన తరవాత 1939 లో శ్రీ అరవిందుడు పై రెండు అనుభవాలకూ అక్షరాకారం కల్పించాడు. ఆ రచనలను అనుబంధంలో చూడవచ్చును.

1903 లో కాశ్మీరు వెళ్ళి శంకరాచార్య శృంగం దర్శించినప్పుడు ఆయనకు సమాధిస్థితి కలిగింది. సాధారణంగా సంవత్సరాల తరబడి సాధనచేస్తేకాని అటువంటి స్థితిని అందుకోలేరు.

1904 నుంచి ఆయన తీవ్రంగా యోగాభ్యాసం మొదలుపెట్టాడు. ప్రాణాయామంతో శ్రీకారం చుట్టి అనతికాలంలోనే ఎన్నో సిద్ధులు పొందగలిగాడు. అప్పటి దినాలను ఇల్లా నెమరువేసుకున్నారు.

"అప్పుడు నేను కవిత్వం రచించేవాడిని. దినానికి సుమారు పదిపంక్తులు. మాసానికి ఇంచుమించు రెండువందల పంక్తులు పూర్తిచేసేవాడిని. కాని ప్రాణాయామం ప్రారంభించిన తరవాత అరగంటలో రెండువందల పంక్తులు పూర్తిచేయగలిగాను. అంతకు పూర్వం నా జ్ఞాపకశక్తి మందంగా వుండేది. క్రమంగా నాధారణాశక్తి వికసించింది. ప్రేరణకలిగినప్పుడు మనస్సులో కూర్చుకున్న పంక్తులను ధారణచేసి తూ.చా. తప్పకుండా తోచినప్పుడు రాసెయ్యగల శక్తి అలవడింది. ఈ మానసికవికాసంతో పాటుగా మెదడులో విద్యుత్తులు పరిగెడుతున్నట్లు తోచసాగింది."

యోగాభ్యాసంలో వున్న లోపాలనుకూడా ఆయన గుర్తించాడు. 1932 లో రాసిన ఒక లేఖలో ఇల్లా అన్నాడు:

"స్వయంగా నాలుగేళ్ళపాటు ప్రాణాయామమూ, ఇతర సాధనలూ చేశాను. వాటివల్ల ఆరోగ్యం అభివృద్ధిచెందటం, శారీరక మానసికసంబంధమైన శక్తులు కొన్ని లోపలినుంచి ఉప్పొంగిరావటం, కళ్ళు తెరిచివున్నప్పుడు కొన్ని జ్యోతి స్వరూపాలను కనుగొనగల సూక్ష్మదర్శనం మాత్రమే లభించాయి. ఇక ముందుకు సాగలేదు."

ఆయన కొందరు యోగులను కలుసుకున్నాడు. వాళ్ళు ఆయన యోగాభ్యాసానికి ఏ విధంగానూ తోడ్పడలేదు. మహారాష్ట్రమునకు చెందిన లేలే అనే యోగి ఆయనకు బాగా సహాయపడ్డాడు. అరవిందుని జీవిత కథ రచించిన

వి. బి. పురాని 1916 లో లేలే యోగిని కలుసుకున్నాడు. బరోడాకు రమ్మని వర్తమానం వచ్చినప్పుడు ఒక మహనీయునికి ఉపదేశం చేయబోతున్నట్లుగా తనకు ముందుగానే స్ఫురించినట్లు లేలే చెప్పాడు.

శ్రీ అరవిందుడు తన కృతజ్ఞతను ప్రకటిస్తూ యిలా అన్నాడు :

"ఈదారి చూపినందుకు నేను ఆయనకు ఋణపడి వున్నాను. ధ్యానంలో ఆసీనుడవై మనస్సును పరిశీలించు. ఏమీ ఆలోచించవద్దు. ఆలోచనలు ఒకదాని వెంట ఒకటిగా మనసులో ప్రవేశించటం కనుగొంటావు. చొరబడనీయకుండా వాటిని దూరంగా తరిమివేయి. అప్పుడు మనస్సు నిర్మలంగా, నిశ్శబ్దంగా నిలుస్తుంది. అని లేలే బోధించాడు.

అంతకు మునుపు భావాలు బైటినుంచి మనస్సులో ప్రవేశిస్తాయనే సంగతి వినలేదు అది నిజమా కాదా అని ప్రశ్నించకుండా కూచొని చెప్పినట్లు చేశాను. క్షణంలో నా మనస్సు గాలి అలలు సోకని పర్వత శిఖరాగ్రంలాగా నీరవమైపోయింది. అప్పుడు ఆలోచనా పరంపర వెలుపలినుంచి లోనికి రావటం గుర్తించాను. మెదడులోకి చేరకముందే వాటిని తరిమివేయసాగాను. మూడు దినాలలో నాకు స్వేచ్ఛ లభించింది. అప్పటినుంచీ నా మనసు విముక్తమయింది. వ్యక్తిగతమైన ఆలోచనల కర్మాగారంలో పనిచేసే కూలీలాగా కాకుండా విశ్వవిస్తతిని సంపాదించుకున్నది. శతాధిక చైతన్యసీమలనుంచి, దృశ్యజగత్తునుంచి భావనారాజ్యాలనుంచి ఎగసివచ్చే జ్ఞానసంపదను ఏరికోరి అందుకోగల శక్తి అలవడింది.

లేలే సహాయం కొద్దికాలమే కావలసివచ్చింది. తన అన్వేషణాబలం వల్లనూ, చిత్తశుద్ధిగా ప్రయత్నించటంవల్లనూ చైతన్య మహాకాశంలోకి ఎగసిపోగలిగినాడు. నిర్వాణమూ నిర్వికల్పసమాధి వంటి అనుభూతులమెట్లు దాటిఅ నిర్వచనీయమైన ఉపలబ్ధిని సాక్షాత్కరించుకోగలిగినాడు. అనంతరకాలంలో పుదుచ్చేరిలో ఈ సీమనే కూలంకషంగా అన్వేషించి స్వాధీనం చేసుకున్నాడు ఒక శిష్యునికి 1987లో రాసిన లేఖలో అరవిందుడు ఏమన్నాడంటే "అనుకోకుండానే నేను నిర్వాణస్థితిలోకి వెళ్ళాను. యోగాభ్యాసం మొదలుపెట్టిన కొద్దికాలానికే అయాచితంగా అనుమతి పొందకుండా నిర్వాణం నాలోకి వచ్చేది."

ఈ కాలంలో చేసిన సాహిత్యసృజనకు వివిధములైన ప్రేరణలు కనబడతాయి. సంస్కృతంలోనూ తదితర భారతీయభాషల్లోనూ లభించే సాహిత్యమును గాఢంగా అధ్యయనం చేశాడు. భారతీయభాషలను సులువుగా నేర్చుకున్నాడు. భార

తీయ సాహిత్యహృదయంతో సన్నిహితసంబంధం ఏర్పడింది. ఇందువల్ల ఆయన కవిత జీవం పోసుకున్నది. బరోడాలోవున్న తరుణంలోనే సావిత్రి మహాకావ్యరచనకు అంకురార్పణం జరిగింది. ఆయన దర్శనానికి అక్షరరూపమైన ఈ మహాకావ్య రచనను పుదుచ్చేరిలో ప్రారంభించి 1950 లో పరమపదించే ముందు పరిసమాప్తం చేశారు బరోడాలో రచించిన చిత్తుప్రతి నష్టమైపోయింది.

చండీదాసు జ్ఞానదాసు ప్రభృతి వంగీయకవుల రచనలు చాలా ఆంగ్లీకరించాడు. మామూలు అనువాదాలు కావు. అవి అద్భుతమైన రూపాంతరాలు. మూలంలోవున్న భావమాధుర్యం చెక్కుచెదరలేదు. అనువాదాలలో ఈ విధంగా మాతృకలోని శక్తిని మరొక భాషలో అందించటం చాలా అరుదు.

తన ప్రేమను సరిగా గ్రహించని కృష్ణునితో రాధ అంటున్నది.

వచ్చే జన్మలో నేను నందనందనుడనౌతాను
వ్రజ కన్యకల ఆనందమౌతాను
అప్పుడు నువ్వు రాధవు కావాలి
హసిత కిశోరవదనంతో కుటిల కుంతలాలతో
అప్పుడు నిన్ను ప్రేమించి నీకు దూరమౌతాను
నదీతీరాన కదంబ తరుచ్ఛాయలో
మధురంగా వేణుగానం చేస్తాను
విరహవేదన నీకు తెలిసిరావాలి.

మైథిలీ భాషలో ప్రసిద్ధకవి విద్యాపతి రాసిన రాధాకృష్ణ ప్రేమను వర్ణించే వైష్ణవ రచనలకు భావనావైభవం దీపించేవిధంగా ఆంగ్లానువాదం చేశాడు.

క్రొత్తసిగ్గుల దొంతరలో లీలావిలాసాలు కనబడనీయదు
పరులకంట బడదు సఖులు తన చిరునవ్వుల దోబూచులాడే
భావాలను పసికడతారేమోనని,
మాధవా! నా మాట విను, నేను చెప్పేది నిజం
ఈనాడు రాధను కళ్ళారా చూశాను
ఈడులేని సౌందర్యరాశిని.

సంస్కృతంనుంచి మూడు గొప్పగ్రంథాలు కాళిదాసుని మేఘదూత, విక్రమోర్వశీయం, భర్తృహరి నీతిశతకం ఆంగ్లంలోకి అనువదించాడు. ఆ కాలానికి దిచెంత అనేక స్వతంత్రరచనలూ అనువాదాలూ నష్టమైనట్లే మేఘదూతానువాదం

లభించటంలేదు. కాని విక్రమోర్వశీయం ఆనాటి ఒడుదుడుకుల నుంచి బైటపడ గలిగింది. డాక్టరు కే. ఆర్. శ్రీనివాస అయ్యంగారి అభిప్రాయం ఏమంటే— "చండీదాసు భర్తృహరి, చిత్తరంజన్ రచనలు అనువదించినప్పటికంటె కాళిదాసు విక్రమోర్వశీయానువాదంలో ఎక్కువ సాహసోపేతమైన ప్రయత్నంచేసి విజయం సాధించాడు. కాళిదాసుని విక్రమోర్వశీయం వాస్తవలోకానికి దూరమైన విచిత్ర కాల్పనిక సౌందర్యంతో ఆకర్షించే నాటకం. అటువంటి రచనను పరభాషలోకి పరివర్తనచేయటం తేలికకాదు. ఆంగ్లభాషావేషధారణ చేయించి మాతృకలోని అందాన్ని వసివాడనీయలేదు. లారెన్సు బిన్యను శకుంతల నాటకానికి చేసిన ఆంగ్లానువాదం లాగే అరవిందుని విక్రమోర్వశీయం మూలంలోని ఆర్తినీ పరిమళాన్నీ ఆంగ్లంలో అందించకలుగుతున్నది. పరభాషలో వేషధారణం చేసినప్పటికీ కాళిదాసు సహజత్వం కోలుపోలేదు.

బరోడాలో వున్నప్పుడు రచించిన కావ్యాలలో ఊర్వశి ఒకటి. ఋగ్వేదంలో మానవుని పరిష్వంగంలో చిక్కిన దివ్యసుందరి గాథ ఆధారంగా కాళిదాసు సృష్టి చేసిన నిత్యలావణ్యమూర్తి ప్రేరణచేయగా ఊర్వశి కావ్యం రచించాడు.

రవీంద్రుడు వృంతహీన వికసితప్రసూనమని వర్ణించిన ఊర్వశి భారతీయ కవులను యుగయుగాలనుంచి ప్రబలంగా ఆకర్షిస్తున్నది. అప్సరస ఊర్వశి వీరుడైన పురూరవునికి ప్రేయసి అయింది. ఈ ప్రాచీనగాథ ప్రకారం ఊర్వశీ పురూరవులు చాలా యేళ్లు కలిసి జీవించారు. కాని వారి వలపు తరిగిపోలేదు స్వర్గంలో తనవిధులు నెరవేర్చటానికి ఊర్వశి తిరిగివెళ్ళలేదు. విసిగివేసారిన వేల్పులు ఆమెను స్వర్గానికి రప్పించుకున్నారు. అప్పుడు పురూరవుడు అపరిమిత విరహవేదన పొందినాడు. ఎంతోకాలం ఆమెకోసం అన్వేషించి చివరికి ఆమెను కలుసుకున్నాడు వాళ్ళ సంయోగం చాలా షరతులకు లోబడవలసివచ్చింది. చివరికి పురూరవుని ప్రయత్నతీవ్రత, ఇష్ట సిద్ధికోసం కఠోరతపస్సు చేయటానికి సంసిద్ధత, ఊర్వశీ సుముఖత జయించాయి. భాగ్యవిధాతలైన దేవతల కఠినహృదయాలు కరిగి ఊర్వశికి పురూరవులకు సహజ శాశ్వత సంయోగప్రాప్తి లభించింది. అది దేవతలు అనుగ్రహించిన వరం.

పైన చెప్పిన ఇతివృత్తమును అరవిందుడు కావ్యంలో అసమానంగా విస్త హించాడు. గంభీర విషాదభరిత ఘట్టాలలోనూ భావోద్విగ్న సన్నివేశాలలోనూ మహా కావ్య లక్షణమైన ఉదాత్తత అన్ని తావులలోనూ సాక్షాత్కరిస్తుంది.

కేశి అనేవాడు అపహరించి నిస్సహాయదశలో వదిలివెళ్ళినప్పుడు ఊర్వశి పురూరవునికి ఈ విధంగా కనిపించింది.

"చెదిరిన కురులతో సుందరంగా వాలిన ఊర్వశి ఎవరో త్రుంచివేసిన స్వచ్ఛ కుసుమంలావుంది. పలచని వలువవందునుంచి భుజమూ వక్షోజమూ బంగరువన్నెలు మెరిపిస్తున్నాయి. స్వర్ణహస్తం పైకిఎత్తి అలవోకగా అమకున్నది. కళ్ల చెదిరే తెలుపు. వెచ్చని ముచ్చటగొలిపే లావణ్యరేఖావిలాసం మంచుకొండలమీద జారి పడిన జాబిల్లి ఆమె వదన బింబం"

పైన వర్ణించిన ప్రశాంతికి విరుద్ధంగా వుంటుంది వాళ్ళ సమాగమ సమయ చిత్రణ.

"చాంపేయ సైకతములపై ఎగసిపడే ఆనందమహార్ణవ తరంగం పురూర వుడు. కోలాహలంగా ఆమెను బాహుపాశంలో బిగించి ఉద్రిక్తహృదయంతో కంపించిపోతున్నాడు. ఆమె అద్భుత కబరీభరం సడలిపోయి గాలిలో అలలుగా తేలుతూ అతని భుజాలమీదవాలి అతని చెక్కిళ్ళకు మెత్తగా తాకుతున్నది. ఆమె పరవశురాలై వణికిపోతూ కంఠనాళాలలో చెలువడిన సంతోషపు మర్మరధ్వనులతో వడగళ్ళవానకు వంగిన లేత తరుకాంతలాగున్నది."

ఊర్వశీ పురూరవులు కడపటికి సంయోగంపొందిన ఘట్టంతో కావ్యం ముగు స్తుంది చివరి పంక్తులలో సూచించిన ఆనందం కేవలం ప్రేమికుల సమాగమాన్ని కాక దానికి అతీతమైన సాఫల్యమును ధ్వనిస్తున్నది. పురూరవుడు అమరుల జ్యోతి ర్లోకాలను అందుకున్నమాట నిజమే. కాని ఈ నేల ...

> ఎంతో దిగువగా ప్రశాంతమైన మహావకాశంలో
> నీరవంగా పరిత్యక్త సంక్షుభిత శ్యామలగాత్రి ధాత్రి
> పరిభ్రమణ సాగుతున్నది.

ఆ ప్రణయ విజయం వీరోచితమేకాని అతిలోకం. అది ధరిత్రికీ నరులకూ సంబంధించినది కాదు.

బరోడాలో రాసిన రెండో దీర్ఘకావ్యం "ప్రణయం-మరణం". ఇందులో నాయికా నాయకులిద్దరూ మానవులు. కాబట్టి వీరి ప్రణయవిజయం మరింత సార్థక

మైనది. ఊర్వశీ పురూరవులకథ చాలా పురాతనం. అప్పటికి ఈ భూమి శైశవ దశలోవుంది. మనకవెలుగు తొలిప్రొద్దులలో నడిచిన కథ అది. "ప్రణయం-మరణం"లో చెప్పిన కథ తరవాత చాలాకాలానికి జరిగింది. అప్పటికి మానవుడు నేలలో వేళ్ళు లోతుగా నాటుకున్నాడు. కాని మానవుని ఆకాంక్షలకు పరిణతికలిగింది. దివ్యమైన సుగుణాలను సాధించే సామర్థ్యం మానవుడికి అలవడింది.

"ప్రపంచపు తొలిప్రొద్దులలో వనసీమలో
ప్రణయానుభూతి వెచ్చగా కొత్తగా స్వచ్ఛంగా అలరారేవేళలో
ప్రభాతం ప్రసూనంతో కేళిసల్పినట్లు
ప్రణయలీలలో రురుడు నవవధువు ప్రియంవదతో...."

ఒక ప్రభాతసమయాన పాముకరిచి ప్రియంవద మరణించింది. గాఢమైన మనోవేదనతో తీవ్రమైన సంకల్పబలంతో రురుడు తిరిగితిరిగి ప్రణయదేవతను కలుసుకుంటాడు. ఆ దేవత సహాయంపొంది భయంకరనరకంలో కొంతకాలంపాటు గడిపి ప్రియంవదకు పునరుజ్జీవనం సంపాదిస్తాడు. తన ఆయుర్దాయంలో సగం త్యాగంచేసి భార్యను బతికించుకున్నప్పటికీ విచక్షణారహిత మృత్యువుమీద మానవుడు సాధించిన విజయం అది.

ఈ కావ్యంలో అనాదికాలంలో భూమిమీద నివసించిన మానవుల స్వేచ్ఛాగానం వినబడుతుంది. మతమూ, ధర్మసిద్ధాంతమూ, రాజనీతీ, బాధ్యతలూ, వ్యవస్థలూ అనే బంధాలకు చిక్కని స్వచ్ఛందమైన ఆత్మలు ఆలాపన చేసిన గానం.

"అప్పుడు భూమి దుర్దాంతశక్తి సమన్విత.

ఆమె సంతత గర్భవతి.

అప్పుడు మైదానాలు గోడలు ఎరుగని స్వేచ్ఛాజీవుల నిలయాలు ఆ హృదయాలు బంధరహితాలు. అకళంకమైన ఆలోచనలు జ్యోతిస్వరూపాలుగా అలరారుతూ వుండేవి."

ఈ కావ్యం చివరిదాకా ధాత్రీ సంగీతమునే ఆలాపన చేస్తుంది. ఊర్వశీ కావ్యం చివర ధరిత్రిని పరిత్యక్తగా వర్ణనచేశారు. "ప్రణయం-మరణం" అంతంలో

సుశ్యామల ధరణిని ప్రస్తుతిచేశారు. రురు ప్రియంవదలను పరివేష్టించిన వెచ్చని సూర్యకాంతులలో సమున్మేషభరితమైన పృధ్విని చిత్రించారు.

"తన సంతానపు సంతోషాన్ని పంచుకుంటూ కోకిలకాకలీ స్వరాలకు పులకిస్తూ ప్రపంచపు ప్రభాతసమయాన వసుంధరసుందరంగా విలసిల్లుతున్నది."

"ప్రణయం-మరణం" కావ్యాన్ని ఇంగ్లండులో పునర్ముద్రణ చేయించాలని ఒక శిష్యుడు ప్రయత్నించాడు. ఆ ప్రయత్నాలను శ్రీ అరవిందుడు వారిస్తూ 1934లో రాసిన ఉత్తరాన్ని పరిశీలిస్తే కాలక్రమాన కవిత్వంపట్ల ప్రజలవైఖరిలో మార్పు వస్తుందని గ్రహించినట్లు స్పష్టమౌతుంది.

"ఈ కావ్యాన్ని ఇంగ్లండులో పునర్ముద్రిస్తే విజయం సాధిస్తుందని నువ్వు భ్రమపడుతున్నట్లున్నావు. మెరిడిత్, ఫిలిప్సు కవిత్వం రాస్తున్న కాలంలో, యేట్సు, ఏ. ఈ. కవులు బీజప్రాయంగావున్న దశలో నేను ఈ కావ్యం రాశాను. ఆ తరవాత కాలం మారింది యేట్సు; ఏ. ఈ. ప్రభృతుల కవిత్వంకూడా పాతదైపోయి ఈ తరానికి నచ్చటంలేదు. నా కావ్యపు స్వరూపమూ తదితర లక్షణాలూ ప్రపంచ యుద్ధానంతరం అమలులోకివచ్చిన విమర్శనాపద్ధతులకు పూర్తిగా విరుద్ధంగా వుంటాయి. ఇప్పుడీ కావ్యం మళ్ళీ అచ్చువేస్తే ఎవరూ దానివంక చూడకపోవచ్చును. లేకపోతే ఎప్పుడో కాలదోషంపట్టి భూస్థాపితమైన సాహిత్యస్వరూపానికి ఇది బల హీనమైన అనుకరణమని భావించవచ్చును. నా అభిప్రాయం భిన్నంగా వుండవచ్చు. కాని ఇప్పుడు దానితో పని జరగదు. మేధావులమనుకునే ఆధునికుల అభిరుచులను బట్టి విజయపరాజయాలు నిర్ణయమౌతాయి. రచించిన సమయంలో ప్రచురించివుంటే అది విజయవంతమయేది. కాని ఇప్పుడు అనుమానాస్పదం ఇంగ్లండులో ఇప్పటికీ చాలామంది సరసులున్నారు. వాళ్ళ చేతుల్లోకివెళ్తే ఈ కావ్యాన్ని ఉత్సాహంగా చదువుతారు. కాని అటువంటివాళ్ళ చేతుల్లోకి అసలీకావ్యం వెళ్ళగలదా అనే నా సందేహం."

భారతీయమైన కథావస్తువులు సమృద్ధిగా చుట్టూవున్నాయి. కాని అరవిందుని విస్తృతమైన సృజనాత్మకశక్తి విశ్వసాహిత్యంలో విఖ్యాతమైన విదేశీయ గాథల నుంచికూడా ప్రేరణం పొందింది. ఆ విధంగా వెలసినదే ముక్తిదాత పరస్యూస్ అనే ఐదు అంకాల నాటకం. పాత పుక్కిటిపురాణాల ధోరణిని వదిలిపెట్టినాడు. ఎలిజబెత్ రాణికాలాన విలసిల్లిన విషాదాంత నాటకాల ఫణితిని అనుసరించాడు.

ఇతివృత్తాన్ని కేంద్రంచేసుకుని దానిచుట్టూ మానవప్రకృతిలోని కల్పనాత్మకశక్తులను ప్రకటించే సన్నివేశాలూ, జీవనాధారమైన ఉద్వేగములూ అల్లుకున్నాడు.

ఈ నాటకంలో గొప్ప అంతరార్థమున్నది. పోసిడన్ అనే సాగరదేవతపట్ల తన తల్లి చేసిన అపచారానికి ఫలితంగా ఆంద్రోమీడాను ఒక శిలకు బంధించి ఒక పిశాచికి ఎరకావాలని శాపించారు. అసహాయురాలైన ఆంద్రోమిడా రాకుమారిని పెర్స్యూస్ రక్షిస్తాడు. ఇది ధర్మరక్షణగా సత్యానికి విజయంగా భాసిస్తున్నది. పెర్స్యూస్ దివ్యాంశలున్న ధీరుడు. ఆంద్రోమిడా సాహసోపేతమైన విప్లవశీలంతో ఆత్మను బంధించే అర్థరహిత శాసనాలనూ మూఢవిశ్వాసాలనూ, కర్మకాండలనూ ఎదిరించగల సాధకురాలుగా చిత్రించబడింది. ఆమె తండ్రి ఇల్లా అంటాడు

"శక్తిమంతులైన దేవతలు మానవులను పాలించే శాసనాలకు అతీతులుగా వుంటారు. మానవుల నిర్ణయాలకు వారు కట్టుబడరు. తన బలిపీఠంమీద మానవులు ఆహుతికావాలని పోసిడన్ దివ్యసంకల్పం. దానిని ప్రశ్నించే అధికారంలేదు మనకు."

అప్పుడామె బదులు చెబుతుంది: "ఆయన అనుశాసనాన్ని ప్రశ్నించకతప్పదు, నీదైవం నిరాహారుడు కావలసిందే'' అని.

నాటకాంతంలో పెర్స్యూస్ ఒక హెచ్చరికగా భవిష్యత్తును సూచిస్తూ ఇల్లా అంటాడు :

"అంధమైన నీచశక్తుల ప్రాబల్యం సన్నగిల్లలేదింకా
ఆరోహణ విధానంగా సాగుతుంది చాలాకాలం గడవాలి
కాని సత్యం వికసించి సంగీతం విలసిల్లుతుంది
మానవులంతా సన్నిహితులై ఏకంకాగల తరుణంవస్తుంది
అందాకా ముందుకు ఒక అడుగుపడినా చాలును
క్రమక్రమంగా ఈ ధరణి స్వర్గాభిముఖమైతే
తన మసకబారిన ఆత్మలో జ్యోతి మేలుకొనగలదు."

బసోతా వజీరులు అనే ప్రణయాత్మక నాటకం కూడా బరోడాలో రాసినదే. అలిపూరు కుట్రకేసు తాలూకు పత్రాలలో సుమారు అర్ధశతాబ్దం మరుగునపడిన ఈ నాటకం 1951 లో వెలుగులోకి వచ్చింది. అరేబియన్ రాత్రుల కథల్లో ఒక

వృత్తాంతానికి ఇది నాటకీకరణం. దీని అంతంలోకూడా ఇంకొక రకమైన విరోధ శక్తులను గురించిన హెచ్చరిక వున్నది.

"పరస్పర ప్రేమసౌందర్యాలకు అర్హులైన తరుణకిశోరులారా! విచ్ఛేదకుడు వచ్చేదాకా ఈ భూమిమీదా అటుపైన దివిలోనూ ఆనందాలలో తేలండి.

జీవితపు చిరునవ్వులలో దాగిన గాంభీర్యాన్నీ తీవ్రతనూ మరువకండి ఈలోపున.

మేముకూడా నవ్వుతున్నా ఖేదంగానే జీవితపథాలలో యాత్ర సాగిస్తాం. అడుగుజారితే సర్వాక్షమాస్వరూపుడు తన వజ్రహస్తంతో మమ్మల్ని సక్రమమార్గాన నిలపాలి. కఠిన భీకర న్యాయాధిపతి భయంకరాననం ప్రదర్శించక, ప్రియజనకుని ప్రసన్నవదనం మాకు చూపాలని వేడుకుంటున్నాము"

# నాలుగో ప్రకరణం

ఈ వివాదమంతా మౌనంలో అణగిపోయిన తరవాత, ఈ కల్లోలమూ ఆందోళనమూ సమసిపోయిన తరవాత, ఆయన గతించిపోయిన తరవాత, ఆయనను దేశభక్తి వైతాళికుడుగా, జాతీయవాద ప్రవక్తగా మానవారాధకుడుగా ఆరాధిస్తారు. ఆయన గతించిపోయిన తరవాతకూడా ఆయన వాక్కులు భారతదేశంలోనేకాక సముద్రాల ఆవల సుదూరసీమల ప్రతిధ్వనిస్తాయి.

చిత్తరంజనదాసు.

## దేశభక్తి ప్రబోధక కవి

తరవాతకాలంలో దేశబంధుగా ప్రఖ్యాతుడైన చిత్తరంజనదాసు అలిపూరు కుట్రకేసు విచారణసందర్భంలో అరవిందుని పక్షాన వాదిస్తూ పలికిన ఉపసంహారక వాక్యాలలో దేశభక్తి ప్రబోధక కవిగా అభివర్ణించాడు. అరవిందుని వ్యక్తిగత జీవితం పరిశీలిస్తే పైన ఉల్లేఖించిన ఉత్తేజపూరితవాక్కుల యదార్థం గ్రహించ గలుగుతాము. అరవిందుడు భార్యకురాసిన లేఖ బహిరంగంగా ప్రకటితమైనది. చరిత్రాత్మకమైన పత్రంగా అలిపూరుకేసు నడుస్తున్న సమయంలోనూ అనంతర కాలంలోనూ పేరుమోసింది. ఆ లేఖ అసంఖ్యాకంగా ముద్రితమై ఆ ప్రతులు దేశ మంతా విస్తారంగా వ్యాప్తిపొందినవి.

భూపాల్ చంద్రబోసు కుమార్తె మృణాళినిదేవిని 1901 లో కలకత్తాలో అరవిందుడు పెళ్ళాడినాడు. పరిచితులు చెప్పినదాన్నిబట్టి మృణాళిని ప్రశాంత గంభీరసౌందర్యంతో సముదాత్తక్షమాగుణ మూర్తీభావంగా వుండేది. బరోడాలో కొంతకాలమూ, కలకత్తాలో అంతకంటే తక్కువకాలమూ భర్తతో కాపురంచేసింది. ఎక్కువగా భర్త సాహచర్యంలో గడిపే అవకాశం ఆమెకు కలగలేదు. ఆకస్మికంగా ఒకనాటి వేకువజామున పోలీసులువచ్చి అలిపూరు కుట్రకేసు సందర్భంలో అరవిందుని బందీగా పట్టుకుపోతుంటే నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. భర్తగారి ఆశయాలలోనూ

కార్యకలాపాలలోనూ ఆమెకున్న అచంచల విశ్వాసమే ఆకస్మిక సంఘటనకు తట్టుకో గల శక్తినిచ్చింది. అరవిందులు పుదుచ్చేరిలో స్థిరపడినపిమ్మట ఎనిమిదేళ్ళకు ఆయన సన్నిధికి రావటానికి అనుమతి దొరికింది. అప్పటికే కాలాతీతమైపోయింది. జ్వర పీడితురాలై 1918 వ సంవత్సరం డిసెంబరు మాసంలో ఆమె మరణించింది.

మృణాళినీదేవికి 1905 లో ఆగస్టు 30 వ తేదీన అరవిందుడు వంగభాషలో రాసిన లేఖలోని భాగాలు ఇవి.

వివాహబంధంతో విధి నిన్ను పెనవేసినవ్యక్తి చాలా వింతమనిషి అని ఈపాటికి గుర్తించావనుకుంటాను. ఇప్పుడీదేశంలో బహుళ సంఖ్యాకులకూ నాకూ దృక్పథం లోనూ, జీవిత లక్ష్యంలోనూ, కార్యసరళిలోనూ ప్రభేదమున్నది. అన్ని అంశాలలోనూ భిన్నమైనదికనక అసాధారణంగా తోచగలదు. అసాధారణ భావాలూ, లోకవిరుద్ధ కార్యక్రమాలూ అత్యున్నతమైన ఆశయాలూ కలవారిని ప్రజాసామాన్యం ఏ పేరుతో పిలుస్తుందో నీకు తెలిసేవుంటుంది నీటిని వెర్రికింద లోకం జమకడుతుంది. ఆ వెర్రివాడు ఏదైనా ఘనకార్యం సాధించిననాడు అతన్ని పిచ్చివాడనకుండా ప్రతిభాశాలి అనీ మహామహుండనీ ప్రశంసిస్తుంది. కాని ఎంతమంది కృషిలో సాఫల్యం పొంద గలరు? వెయ్యిమందిలో ఒక పదిమంది అసాధారణులుంటారు. వాళ్ళలో ఒక్కడే జయిస్తాడు. నేను స్వీకరించిన రంగంలో విజయం అసాధ్యం. అందులో నేను పూర్తిగా నిమగ్నుడను కాలేదు. కాబట్టి లోకులు నన్ను పిచ్చివాడికింద లెక్క వేస్తారు. పిచ్చివాడి భార్యకావటం స్త్రీకి దురదృష్టం. సంసారపు సుఖదుఃఖాలకే ఆడవాళ్ళ ఆశయాలు పరిమితాలు. పిచ్చివాడు కట్టుకున్న ఇల్లాలిని సుఖపెట్టలేడు. పైగా బాధలకు గురికావలసివస్తుంది.

నాకు మూడురకాల పిచ్చులు. మొదటిది: ఈశ్వర ప్రసాదితములైన గుణ ములు, నైపుణ్యములు, ఉన్నతవిద్య, జ్ఞానము, ధనము సర్వమూ ఆయనకుచెందిన సొత్తు. కుటుంబపోషణకు కావలిసినది, తప్పనిసరిగా ఖర్చుచేయవలిసినది మాత్రమే వాడుకోటానికి నాకు అధికారమున్నది. పోగా మిగిలినదంతా ఆయనకే నివేదించు కోవాలి. వచ్చినదంతా నా వ్యక్తిగత సుఖంకోసం భోగంకోసం వ్యయంచేస్తే నేను దొంగతనం చేసినట్లే భావిస్తాను. హిందూ ధర్మశాస్త్రాలలో ఈశ్వరునిదగ్గర నుంచి ధనం స్వీకరించి ఆయనకు తిరిగి ఇవ్వనివాడు దొంగ అని చెప్పారు. ఇంత వరకూ నా ధనంలో స్వల్పభాగమే ఈశ్వరార్పణచేసి పదింట తొమ్మిదివంతులు నా సుఖాలకే వెచ్చించాను. ఇల్లాచేసి ఐహికసుఖాలలో మునిగివున్నాను. ఇప్పటికే

జీవితంలో సగంకాలం గడిచిపోయింది. తనకూ తనవారికీ ఆహారం సమకూర్చ గలిగినందుకు జంతువులుకూడా సంతృప్తిపడతాయికదా....

పరోజీవికి ఉషకు డబ్బు ఇచ్చినందుకు నేను పశ్చాత్తాపపడటంలేదు. ఇతరులకు సహాయపడటం ధర్మమే. నీమీద ఆధారపడినవాళ్లకి సాయంచేయటం గొప్ప ధర్మమే. తోడబుట్టిన సోదరీసోదరులకు సాయపడినంతమాత్రాన లెక్కసరిపోదు. ఈ కష్టకాలంలో దేశమంతా మన ప్రాంగణంలో సహాయం అపేక్షిస్తూ నిలబడి వున్నది. ఇప్పుడు నాకు ముప్పదికోట్ల సోదరీసోదరులున్నారు దేశంలో. చాలామంది. తిండిలేక చనిపోతున్నారు. అధిక సంఖ్యాకులు బాధలతో కష్టాలతో బలహీనులై ఎల్లాగో బతుకులు ఈడుస్తున్నారు. వాళ్ళకి సహాయం చేయాలి. నీ అభిప్రాయమేమిటి? ఈ ధర్మపాలనలో అర్థాంగివై భాగం పంచుకుంటావా? మనం ఆహారంలో వేషధారణలో సామాన్యజనులమాదిరిగావుంటూ అత్యవసరమైనవే కొంటూ మిగిలినదంతా ఈశ్వరార్పితం చేయాలి. అల్లా చెయ్యాలని నా అభిమతం. నువ్వు దీనిని ఆమోదించి త్యాగానికి సిద్ధపడితే నా నిర్ణయం నెరవేరగలదు. మార్గంలో ముందుకు సాగలేకపోతున్నానని నువ్వు అంటున్నావుకదా. అభివృద్ధిచెందటానికి నీకు నేను సూచించే మార్గమిది. ఈ మార్గం నువ్వు అనుసరిస్తావా?

ఇటీవల నన్ను పట్టుకున్న రెండో పిచ్చి ఇది. ఏవిధంగానైనా సరే దైవ సాక్షాత్కారం పొందాలి. నేడు ధర్మాభిరతి దైవనామం పదేపదే ఉచ్చరించటంలోనూ పదిమందిలోనూ దైవప్రార్థనచేస్తూ నలుగురికీ భేషజంగా చాటుకోటంలోనూ వెల్లడి అవుతున్నది. అటువంటి మతం నాకు వద్దు. ఈశ్వరుడున్నప్పుడు ఆయన ఉనికిని అనుభవించే మార్గం, ఆయనను సాక్షాత్కరించుకునే విధానం వుండితీరాలి. ఎంత కఠినమైనప్పటికీ ఆ మార్గం అనుసరించాలని నేను దృఢనిశ్చయం చేసుకున్నాను. ఆ మార్గం మనిషి ఆత్మలోనే మనస్సులోనే కనుగొనగలమని హిందూ ధర్మం పక్కాణిస్తున్నది. ఆ మార్గాన్ని అనుసరించగల నియమంకూడా అలవరుచుకున్నాను. చెప్పిన నియమాలన్నీ పాటించి ఒక్క మాసంలోనే హిందూధర్మం చెబుతున్నవన్నీ యదార్థాలని గ్రహించగలిగాను. శాస్త్రిలు చెప్పిన సూచనలన్నీ అనుభవంలోకి తెచ్చుకున్నాను. ఈ పథంవెంట నిన్నుకూడా తోడ్కొని పోవాలనుకుంటున్నాను. తగిన పరిజ్ఞానంలేదు కాబట్టి నువ్వు నాతోపాటుగా ముందుకు సాగలేవు. కాని నన్ను అనుసరించి రావటానికి ఆటంకమేమీ వుండదు. ఈ మార్గంలో పయనించిన వారందరూ పరిపూర్ణతను చేరుకోవచ్చు. కాని ఈ మార్గంలో అడుగుపెట్టటమనేది

పీ ఇష్టంమీద ఆధారపడుతుంది. అందులో ప్రవేశించవలసిందని ఎవ్వరూ నిర్బం ధించలేరు. మీకు ఇది నచ్చితే ఈ విషయాన్నిగురించి ముందుముందు ఇంకా విశ దంగా రాస్తాను.

నాకు పట్టిన మూఢోపిచ్చి ఇది ఇతరులు దేశాన్ని నిర్జీవపదార్థంగా తలపోసి మైదానాలూ పొలాలూ అడవులూ కొండలూ నదులూ ఇవే దేశమనుకుంటారు. నేను దేశాన్ని మాతృమూర్తిగా ఆరాధించి పూజిస్తాను ఆ తల్లిని. తల్లి గుండెలమీద ఒక రక్కసి కూచుని రక్తంపీలుస్తున్నప్పుడు కుమారుడు ఏంచేయాలి? సంతృప్తిగా కూచుని భార్యాబిడ్డలతో సుఖిస్తూ కాలక్షేపం చేయాలా? లేక తల్లిని కాపాడటానికి పరుగులుతీయాలా ? ఈ పతితజాతిని ఉద్ధరించగలశక్తి నాకున్నదని గుర్తించాను. అది భౌతికశక్తికాదు. నేను కత్తులతో తుపాకులతో పోరాడబోను. నా ఆయుధం జ్ఞానం. క్షాత్రతేజమొక్కటే శక్తికాదు. జ్ఞానంమీద ఆధారపడిన బ్రాహ్మతేజం కూడా ప్రబలశక్తియే. ఈ భావం నాలో కొత్తగా తలయెత్తలేదు. అది పుట్టుకతోనే నాకు కలిగింది. అది నా ఎముకల మూలుగులోవున్నది. ఈ మహోద్యమ సాధన కోసమే ఈశ్వరుడు నన్ను భువికి పంపినాడు. పదునాలుగేళ్ళప్రాయాన అది నాలో మొలకలెత్తి పదునెనిమిదేళ్ళకు వేళ్ళనాటుకుని అచంచలంగా కుదురుకున్నది.''

ఇది రచించినసమయంలో కర్జన్‌ప్రభువు వంగదేశ విభజన తలపెట్టాడు. విద్యావంతుల చైతన్యమనే గంగాతరంగాలలో జ్వాలలు ఎగసినవి. లండనునుంచి వెలువడే టైమ్సు పత్రికావిలేఖరి వేలంటీను షిరోలు "అంతటి ప్రజాందోళన భారత దేశంలో అపూర్వము'' అన్నాడు

అప్పటికి అరవిందుని ప్రోత్సాహంతో దేశమంతటా రహస్యసంఘాలు తల ఎత్తినవి. వేలాదియువకులు వాటిలో సభ్యులుగా చేరారు. వాటి కార్యకలాపాలు చాలా రహస్యంగా జరిగేవి. కాబట్టి తరవాత తరాలవారికి ఆ రహస్య సంఘాలను గురించీ వాటి కార్యక్రమాలను గురించీ తెలుసుకునే అవకాశంలేకుండా పోయింది.

ఈ రహస్య సమాజాలు లక్ష్యాన్ని పూర్తిగా సాధించగలవని అరవిందుడు తలపోయలేదు. జనసామాన్యమును జాగరితం చేయటానికి ఉద్యమం సాగినప్పుడే ఈ సంఘాలకృషి ఫలించగలదని గుర్తించాడు. బరోడా సంస్థానంలో వుద్యోగిగా వున్నంతవరకూ ఏ రాజకీయాందోళనలోనూ బహిరంగంగా పాల్గొనటానికి వీలు కాదు. కాని వంగవిభజన శాపరూపంలో వచ్చిన వరం. అదను పదులుకోరాదు. అరవిందుడు భవానీమందిరమనే ప్రణాళిక రచించాడు. అందులో అంతరార్థంతో

పాటు అనుసరణీయమైన కార్యక్రమంకూడా అందించాడు. సంతకంలేని ఈ పత్రం ప్రతులు ఆయన అనుచరులు పంచిపెట్టారు. ఆయన తమ్ముడు బారీంద్రకుమారూ, ఆయన సిఫార్సుతో బరోడాసైన్యంలో చేరిన జతీన్‌బెనర్జీ, బారిష్టర్ పి. మిత్రా ప్రభృతులు అనుచరులు.

“భవానీ మందిరం” ప్రారంభం భక్తిభావపూరితం.

“పర్వతసీమలో జగజ్జనని భవానికి మందిరం నిర్మించి నివేదించాలి. ఈ పవిత్ర కార్యక్రమంలో పాల్గొనవలసిందని ఆ జనని కన్నబిడ్డలందరికీ విన్న విస్తున్నాము.”

ఆ విన్నపంలో ప్రధానాంశం సమిష్టిశక్తిని సమకూర్చుకోవాలనే ఉద్బోధ.

“అనంతంగా పరిభ్రమిస్తున్నదీ విశ్వం కాలచక్రం నిరంతరం మహా వేగంతో తిరిగిపోతున్నది. కాలాతీతునినుంచి ప్రసరించే అనంతశక్తియే ఈ పరిభ్రమ ణానికి ప్రచోదనం కలిగిస్తున్నది. దీని ఫలితంగానే మానవుడు విభిన్నశక్తులతో, వేరువేరు రూపాలతో ప్రత్యక్షమౌతూ వచ్చాడు. ఒక్కొక్క అంశనుబట్టి ఒక యుగలక్షణం ఏర్పడింది. ఒకసారి ప్రేమరూపిణి, ఇంకొకసారి కృపామయి.

ఈ అనంతశక్తియే భవాని, దుర్గ, కాళికాదేవి. ఆమెయే ప్రేమమయి రాధా దేవి. ఆమెయే లక్ష్మీదేవి. ఆమెయే మనందరినీ సృష్టించిన మాతృమూర్తి.

భవాని శక్తిస్వరూపిణి.

ఇప్పుడు మన జనని శక్తిరూపంధరించి నిలిచింది. ఆమె సంపూర్ణశక్తిమయి. సమస్త విశ్వమూ అమ్మను శక్తిస్వరూపిణిగా ఆరాధిస్తున్నది.

మన కళ్లుతెరిచి చుట్టూవున్న ప్రపంచాన్ని పరిశీలిద్దాం. ఎక్కడ చూసినా మహత్తర శక్తిస్వరూపాలు కళ్ళకు కనబడుతున్నవి. భయంకరవేగంతో, విధ్వంసకా ర్యంగా విరుచుకుపడుతున్న శక్తివాహినులు మహోన్నత స్వరూపాలతో గోచ రిస్తున్నవి. వాటి ఆకారంగా ప్రబలంగా విజృంభిస్తున్నది. చరిత్రలో కనీవినీ ఎరుగ నంతగా శతసహస్రాధికంగా ఈనాడు సమరశక్తి, ధనశక్తి, శాస్త్రవిజ్ఞానశక్తి ఆయుధ పరికరాలరూపంలో విజృంభిస్తున్నవి. అంతటా జగజ్జనని లీలావిలాసమే. ఆమె ప్రబలహస్తములే దేవాసుర రాక్షసశక్తులకు మహాస్వరూపాలు కల్పిస్తున్నవి. విశ్వరంగములోనికి ఆ శక్తులు దుముకుతున్నవి, పాశ్చాత్యదేశాల్లో మహాసామ్రా

జ్వాలు క్రమంగా అవతరించటం మనం పరికించాము. జపానుదేశంలో ఆశక్తి విశృంఖలంగా ప్రబలవేగంతో ఎగసిపడటం గమనించాము. అందులో కొన్ని మ్లేచ్ఛశక్తులు తమస్సుతో నల్లగానూ రజస్సుతో ఎరుపుగానూ బలం చూపుతున్నాయి. పరిత్యాగమూ సమగ్ర సమర్పణమూ అనే పవిత్రజ్వాలల్లో ప్లావితమైన ఆర్యశక్తులు కొన్ని కనబడుతున్నాయి. అవన్నీ అమ్మ ధరించిన నూతన స్వరూపాలే. నూతనాకారాలు మలచుకుంటూ నవ్యరూపాలు సృష్టించుకుంటున్నది అమ్మ. ప్రాచీనమైన వాటిలోకి తన నూతనశక్తిని ప్రవహింపజేస్తున్నది. నవీన స్వరూపాలను గిరగిర విసురుతున్నది. శక్తిహీనులం కావటంవల్ల మనం భారతదేశంలో అన్ని తావుల్లో అపజయం ఎదుర్కొంటున్నాము.

భారతదేశంలో పవనం మందంగా వీస్తున్నది. శక్తి నిదానంగా వస్తున్నది. ప్రాచీన భారతజనని నిర్వేదంతో బాష్పాలతో పునర్జన్మకోసం ప్రయత్నిస్తున్నది. కాని ప్రయత్నాలు ఫలప్రదాలు కావటంలేదు. ఇంత సువిశాలమైన శక్తిమంతమైన దేశాన్నిపట్టి పీడించే వ్యాధి ఏమిటి? తప్పనిసరిగా ఏదో లోపం వుండితీరాలి సజీవశక్తి ఏదో లోపించింది. ఆ బలహీనతను వేలెత్తిచూపటం కష్టంకాదు. తక్కినవన్నీ వున్నాయి. కాని శక్తిహీనత బలహీనత దాపురించాయి. శక్తిని మనం విసర్జించాము కాబట్టి మనలను శక్తి విసర్జించింది. మన హృదయాలలో మెదడులలో బాహువులలో శక్తిరూపిణి జనని కానరావటంలేదు."

మనకు జ్ఞానం వుండేది. శక్తిహీనతవల్ల అది నిర్జీవమయింది. మనకు భక్తి వుండేది. నిజమైన భక్తిజ్వాలకు శక్తియే ఇంధనం. తైలం లోపిస్తే జ్వాల ఎంత కాలం వెలుగుతుంది?

"మనలో పలువురు తమస్సుకు దాసులైనారు. అలసత్వమనే భీకరాంధ రాక్షసికి చిక్కి దేశం పునరుజ్జీవితం కావటం అసంభవమనీ, భారతదేశం రక్తహీనమై జీవరహితమై శిథిలమైపోయిందనీ ఈనాడు భావిస్తున్నారు. ఈ జాతి క్షీణించి నశించిపోక తప్పదంటున్నారు. ఇది అర్థంలేని బుద్ధిలేని వాదం. ఇది ఒక మనిషికాని జాతికాని బలహీనతనుకోరి వరించినప్పుడే క్షీణించిపోయి నశించటం జరుగుతుంది. కోరి తెచ్చుకుంటేకాని ఆ ముప్పు వాటిల్లదు."

కాని జాతి అంటే ఏమిటి? కోట్లప్రజల సమిష్టిశక్తియే జాతి. జాతిని పునరుజ్జీవింపజేయటమూ నశింపజేయటమూ మన ఇచ్ఛమీదనే ఆధారపడివుంటుంది. అభ్యర్థనం ఉత్తేజపూరితమైన ఉద్బోధగా పరిణమించింది.

"జాతి అంటే యేమిటి? మాతృభూమి అంటే యేమిటి? అది ఒక భూఖండం కాదు. అది ఒక రూపకాలంకారంకాదు. బుద్ధిజనితమైన కల్పనకాదు. అది ఒక మహత్తరశక్తి ....రండి. జనని ఆహ్వానం ఆలకించండి. మన హృదయవాపివిగా తన స్వరూపం ఆవిష్కరించి ఆరాధనలు అందుకోటానికి జనని నిరీక్షిస్తున్నది. మనలో దైవాంశను తమస్సు కప్పివేసింది. కనక ఆమె విశ్చేతనంగా వ్యధచెందు తున్నది. తమను ఆదుకోవలసిందని తన సంతానం అర్థించటంలేదని జనని వేదన పడుతున్నది. జనని మీలో మెదులుతున్నదని గుర్తించి స్వార్థపు నల్లముసుగులు చీల్చండి. చుట్టూ లేచిన ఆలసత్వపుగోడలు కూలదోయండి. మీకు తోచినవిధంగా జననికి సాయపడండి. ప్రతివ్యక్తీ తన సామర్థ్యానికి అనుగుణంగా శరీరమునూ, బుద్ధిబలమునూ, వాక్కునూ, ధనమునూ, ప్రార్థనలనూ, ఆరాధనలనూ ఎవరికి చేత నైనది వారు జననికి సమర్పించాలి. వెనకకు తగ్గవద్దు ఆమె పిలుపు వినికూడా ముందుకు రానివారిమీద జనని ప్రాదుర్భవించే తరుణంలో ఆగ్రహించగలదు ఆమె ఆవిర్భావమునకు లేశమైనా పాటుపడినవారికి సముజ్వలసుందర ప్రసన్నవదనంతో జనని ప్రత్యక్షం కాగలదు.''

ఈ విధంగా భారతదేశమును మాతృమూర్తిగా ఆయన విశ్వసించి విశదీక రించాడు. తరవాత కొన్ని నెలలకు వందేమాతరమనే నినాదంతో భారతదేశంలో ఆంగ్లసామ్రాజ్యపు పునాదులు కదిలిపోయాయి.

తన సంతానపు ఆలసత్వమనే దుర్భరభారం అడుగునపడి దేశమాత మూలుగు తున్నదనే భావం దేశీయులకు జ్ఞాపకం చేయటానికే భవానీమందిరం రచించాడు పూర్వకాలంలో జన్మించిన ఉజ్వలమూర్తులను పోలిన వ్యక్తులు ఈ పవిత్రభూమిలో ఉదయించటం లేదనికాదు. దేశం వాళ్ళవల్ల ఉత్తేజం పొందటానికి సిద్ధంగావున్నా లేకపోయినా అటువంటి మహాపురుషులు జన్మిస్తూనే వున్నారు. ఆ కోవకుచెందిన వాడు బంకిమచంద్రుడు. బరోడాలో వున్నప్పుడు ఇందుప్రకాశ్ పత్రికలో బంకిం బాబునుగురించి రాశాడు. ఆయననుగురించి కవితకూడా రచించాడు. బంకింబాబును ప్రశంసించే రచన 1907 లో బందేమాతరం పత్రికలో పునర్ముద్రణ పొందింది.

"ఈ మహత్తర ప్రాచీనదేశపు పూర్వవైభవాలను తలుచుకుంటూ పూర్వపు ఋషిపుంగవులనూ వారు సృజించినభావములనూ నాగరికతనూ ప్రశంసిస్తూ అటు వంటి మహిమాన్వితులు ఉదయించిన మహాయుగం గతించిపోయిందనీ, విషాదకర మైన వర్తమానంలో పతితులైన నేటి మానవులలో ఋషిసత్తములు జన్మించరనీ

విచారపడేవారు చాలామంది వున్నారు. ఇది పొరబాటు, ముమ్మాటికీ పొరబాటు. మన దేశం, మన జాతీ, మన మతమూ చిరంతనమైనవి. మన శక్తీ, మన మహత్వమూ, మన పావనత్వమూ మబ్బుచాటున మరుగుపడినవేకాని అంతరించిపోలేదు. ఈ పవిత్రభూమి వీరులనూ, ఋషులనూ, సాధుపురుషులనూ సహజంగా ప్రసాదిస్తూనే వున్నది. అటువంటివారు ప్రతి యుగంలోనూ ప్రభవిస్తునే వున్నారు. జాతిని పునరుజ్జీవింపజేసి నవభారతమును సృష్టించిన వందేమాతరమనే మంత్రమును ప్రసాదించిన మహనీయుని నామమును ఇటీవల వెలసిన ఋషిపరంపరలో చేర్చవలెనని మనం చివరికి గ్రహించగలిగినాము."

కలకత్తాకు వచ్చినతరవాత బాజీప్రభు అనే వీరునిగురించి కావ్యం రచించాడు అరవిందుడు. శివాజీ తిరోగమనాన్ని నిరోధిస్తూ ఒక కనుమవద్ద చిన్న సేనతో పన్నెండువేలమంది శత్రుసైన్యాన్ని రెండుగంటలపాటు అటకాయించిన వీరాగ్రేసరుడు బాజీప్రభు. భూతకాలపు మేఘమండలంనుంచి దిగువనిలబడి ముగ్ధులై ఆలకించే భారతీయులకు బాజీప్రభువు ఈ సందేశం అందిస్తున్నట్లు అరవిందుడు చిత్రించాడు

"ఉక్కువలె మొక్కవోని ఆత్మబలం అలవరచుకోవాలి

దేవిభవాని అనుగ్రహిస్తే శక్తికి కరవాలములకూ కరువు వుండదు.

మన జాతి భవితవ్యమును పరాజయమునుంచి ఆమె కాపాడగలదు."

ముక్తఛందస్సులో నడిచిన ఈ వీరగాథ నాటి దేశపరిసర వర్ణనతో ప్రారంభిస్తుంది.

"దక్కను వీరభూమి మధ్యాహ్న మార్తాండుని ప్రచండవీక్షణల నిరంకుశ పాలనలో అణగారిపోతున్నది.

సూర్యాతపంలో పర్వతాలు మౌనంగా నిలబడ్డాయి.

ఏనాడో ఇంకిపోయిన వాహినులవంక ఎండిపోయిన పొలాలు దాహంతో తపిస్తూ ఆశగా చూస్తున్నాయి."

మండిపోయే ఆ మరుభూమికి బాజీప్రభుని మహత్తర ప్రాణత్యాగం పుష్టినొసగే వృష్టికాదా? విశాల భారతదేశమంతా ఆనాడు ఇంకొకవిధమైన నియంతృత్వపు ప్రచండవీక్షణలో సొమ్మసిల్లిపోతున్నది. బాజీప్రభువువంటి వీరుల ఆవిర్భవించాలని భారతదేశం వేచి చూడటంలేదా?

"తనయునికి తల్లి ప్రబోధం" అనే మకుటంతో తొలుత ప్రచురితమైనది "విమల". మహాభారతంనుంచి గ్రహించిన ఈ కథకు కొత్తమెరుగుదిద్ది నూతనార్థం కల్పించాడు.

శత్రువులు సంజయుడనే రాజకుమారుని పదవీచ్యుతుని చేయగా అతను నిరాశా నిస్పృహలకు లోనైపోయి ధర్మాన్ని మరిచిపోతాడు. రాజ్యం శత్రువుల నుంచి గెలుచుకోవటమో, ఆ ప్రయత్నంలో ప్రాణం విడవటమో రాజధర్మం. సంజయుడు తన దుస్థితిని భరిస్తూ సామాన్యజీవితం గడపాలని తలపోసి విధికి తల వొంచుతాడు. ప్రదీప్తజ్వాలవంటి వీరమాతకు పుత్రుడుకావటం అతని భాగ్యం.

"కుమారా!" అని సంబోధించింది విదుల.

మాతృహృదయానికి ఆనందం అందించే నందనుడవు కావు నీవు.

వినబడటంలేదా శత్రువుల విజయోత్సాహం, అవహేళనలు ?

ఇంకా ఇల్లాగే కాలం గడిపేయాలనుకుంటున్నావా ?

నీ జనకుడు వీరాగ్రేసరుడు కాడా? నిన్ను నా గర్భంలో ధరించలేదా ?

నీచులైన పిరికిపందలకు పుట్టినవాడివి మారుపడి మా బిడ్డగా పెరిగినావా ?

పురుషకారం ప్రదర్శించు. తీవ్రప్రయత్నంలో వెనకడుగువేయకు కదనానికి కదిలిపో.

కర్తవ్యం నిర్వర్తించినప్పుడే దైవఋణం తీరుతుంది; నిన్నుగురించి నువ్వు సిగ్గుపడే అవసరం పోతుంది.

సంజయా! నీ జ్వాల ధూమ ధూసరితం కానీయకు

ఆకలిగొన్న వీరసింహంలాగా శత్రువులమీద వురికి తీవ్రభయంకర శౌర్యం చూపి సంహరించు.

ఓడిన శత్రువుల మృతకళేబరాల మధ్య ప్రభంజనంగా విజృంభించు.

ఉదాత్త కార్యాచరణకు వెనుదీయకు. నీచకృత్యాలకు పాల్పడకు. నీచకృత్యాలకు అవనతులైనవారికి స్వర్గద్వారప్రవేశం వుండదు. ఇహలోకంలో విజయం కలగదు

భీకర సంఘర్షణ పిడికిలినుంచి దుర్ఘటమైన విజయమును నువ్వు వశపరుచుకున్ననాడు నిన్ను నా కన్నబిడ్డగా ప్రేమిస్తాను."

సంజయునిపోలిన స్థితిలోవున్న భారతీయులకు భారతమాత ప్రబోధం ఈ పలుకుల్లో ధ్వనించటంలేదా ?

భవానీమందిరంలో దేశమాత పునరుజ్జీవనం పొందటానికి ప్రజలు చేయవల పిన కర్తవ్యాలు ప్రబోధించాడు. ఆదర్శవీరమాత తన సంతానంనుంచి అపేక్షించే కర్తవ్యదీక్షను విదుల కంఠస్వరంలో పలికించాడు. జనని కటాక్షముకొరకు తన యులు పఠించవలిసిన మంత్రమును దుర్గాస్తోత్రంలో అందించాడు. జాతి ఆకాంక్ష లతో స్పందించే ఈ మంత్రం ద్వారా సమగ్ర సమర్పణచేసుకుని జనని ఆశ్రయమును పొందేమార్గం సూచిస్తుంది ఈ మంత్రం

"దుర్గామాతా! త్రిశూలధారిణీ, సింహవాహినీ, కవచరక్షిత సుందరగాత్రి, విజయప్రదాయినీ జననీ! నీ ప్రసన్నస్వరూప సాక్షాత్కారంకోసం భారతభూమి నిరీ క్షిస్తున్నది. మా విన్నపం ఆలకించు. ఈ భారతవర్షంలో సాక్షాత్కరించు.

దుర్గామాతా! ప్రేమశక్తి సుజ్ఞానప్రదాయినీ! ప్రచండ సౌందర్యరూపిణివై నీ ప్రబలశక్తిని ప్రదర్శిస్తున్నావు. జీవితసమరంలో భారతవర్ష సంగ్రామరంగంలో నీవు నియమించిన సైనికులము జననీ!

మా హృదయాలకూ మనస్సులకూ అమరశక్తినీ, మా ఆత్మకూ బుద్ధికీ దివ్యాంశలనూ సుజ్ఞానమునూ ప్రసాదించు మాతా!

# అయిదో ప్రకరణం

అరవిందుని ప్రతిభ ఉల్కవలె మెరిసింది. కొద్దికాలం పాటు ఆయన సమున్నత గగనభాగాన భాసించాడు. ఆయన సముజ్జ్వలదీప్తి కన్యాకుమారినుంచి హిమాలయందాకా దేశాన్ని ముంచివేసింది.

డాక్టరు పట్టాభి సీతారామయ్య
భారత జాతీయ కాంగ్రెసు చరిత్ర

## జాతీయవాద ప్రవక్త

కలకత్తాలో పంటీర్‌మార్‌లో నవంబరు 9, 1906, ఒక బ్రహ్మాండమైన ప్రదర్శనం జరిగింది. ఆ సందర్భంలో సుబోధ్‌మల్లిక్ అనే సంపన్నుడు ఆవేశ పూరితుడైన దేశభక్తుడు ఒక జాతీయకళాశాలను స్థాపించటానికి లక్ష రూపాయల విరాళం ప్రకటించాడు భారతదేశాన్ని పాలిస్తున్న ఆంగ్లప్రభుత్వపు అధీనంలేకుండా అది నడవాలని ఆయన ఆశయం.

జనసమూహం ఏకకంఠంతో సుబోధ్‌మల్లిక్‌ను రాజా అని ప్రశంసించింది. రాజా అనే బిరుదు ఆయనపేరు ముందర స్థిరంగా నిలిచిపోయింది. ఇది జాతి చరిత్రలో అద్వితీయం.

అప్పుడు సుబోధ్‌మల్లిక్ ఒక ఆమోదకరమైన షరతు విధించాడు. అంత వరకూ బరోడాలో ఉద్యోగంచేస్తున్న అరవిందుడు కలకత్తా నగరానికి విచ్చేసి స్థాపించదలిచిన కళాశాల రూపురేఖలు దిద్దవలసిందని అభ్యర్థించటానికి నిశ్చ యించాడు. అభ్యర్థించటం జరిగింది. శ్రీ అరవిందుడు అంగీకరించాడు. బరోడా కళాశాల వైస్ ప్రిన్సిపాల్‌పదవికి రాజీనామాఇచ్చి కలకత్తావచ్చి రాజకీయరంగంలో 1906 లో బాహాటంగా ప్రవేశించాడు.

ఆ సంవత్సరమే ప్రసిద్ధ దేశభక్తుడు బిపిన్‌చంద్రపాల్ బందేమాతరం పత్రిక స్థాపనలో సహకరించవలసిందని కోరినాడు. అరవిందుడు తన సహకారం అందజేశాడు. కొద్దికాలంలోనే ఆ వార్తాపత్రిక భారతీయ విప్లవశక్తులకు ప్రతీక మయింది. అప్పుడు స్టేట్సుమన్ పత్రికాసంపాదకుడుగా వుండే రాట్‌క్లిఫ్ బందే మాతరం పత్రికనుగురించి ఇల్లా అన్నాడు "అంతకుపూర్వం భారతీయ పత్రికల్లో అంత శక్తిమంతంగా ప్రతిభావంతంగా ఆంగ్లభాషను ఎవరూ ప్రయోగించలేదు. ఆంగ్లంలో రాసిన సంపాదకీయాలతో ప్రత్యేక వ్యాసాలతో అలరారుతున్న పత్రిక అప్పుడు జాతీయభావ అతివాదవర్గానికి ప్రబలమైన ప్రసారవాణిగా రూపొందింది.

1906 లో ఆగస్టు మాసంలో అరవిందుడు జాతీయకళాశాల ప్రిన్సిపాల్ పదవి స్వీకరించాడు. వందేమాతరం పత్రికకూ వర్ధమానమౌతున్న నేషనలిస్టు పార్టీకి ఎక్కువ సమయం వినియోగించవలసి వచ్చింది అందుచేత విద్యారంగంలో ఎక్కువకాలం వుండలేదు. త్వరలోనే ప్రిన్సిపాలు పదవికి రాజీనామా చేశాడు.

తరుచుగా బ్రహ్మాండ బహిరంగసభలలోనూ బందేమాతరం పుటలలోనూ శ్రీ అరవిందుడు భారతదేశంలో బ్రిటిషు పరిపాలన అటకట్టించటానికి నిర్దిష్టమైన ప్రణాళికను సూచించాడు. స్వదేశీ పరిశ్రమల ప్రోత్సాహం, జాతీయ విద్యావిధానం, ప్రభుత్వ సంస్థలతో సంపూర్ణ సహాయనిరాకరణం, కార్యదీక్షాదక్షమైన స్వచ్ఛంద సేవకదళం ఆయన ప్రణాళికలో ముఖ్యాంశములు. తరవాత నాలుగు దశాబ్దాలు నడిచిన స్వాతంత్ర్యసమర చరిత్రలో ఏదో ఒక రూపంలో ఈ అంశాలే లక్ష్యసిద్ధి కలిగేవరకూ ముఖ్యసూత్రాలుగా నిలిచాయి. దేశమును మాతగా చిత్రిస్తూ భారతీయ జాతీయజాగృతికి సంపూర్ణ స్వాతంత్ర్యమే పరమగమ్యమని నిశ్చయంగా నిస్సంకో చంగా ప్రకటించటంవల్ల యువతరాల హృదయాలమీద ఆయన ప్రభావం గాఢంగా పడింది. తరుణ హృదయాలను ఆయన ఉద్రూతలూగించాడు.

పత్రికా రచనద్వారా అరవిందుడు స్వాతంత్ర్యప్రబోధం చేశాడు. విషయా లను విపులీకరించటంలోనూ, శైలిలోనూ వినూతన స్వచ్ఛందత ప్రదర్శించాడు. విరోధాలను నిరసించాడు. తమ పరిపాలనలో సుగుణాలూ లాభాలూ వున్నవని పరాయిప్రభుత్వం ప్రచారంచేసిన నిరాధారమైన అభిప్రాయాలనుంచి విముక్తి కలిగిం చాడు. దేశం బలహీనమైపోయింది కాబట్టి బాధలకు గురికాక తప్పదనే అసహాయ స్థితినుంచి విముక్తి కలిగించాడు. 1907 వ సంవత్సరం జూలై 14 న బందే మాతరంలో ప్రచురించిన వ్యాసంలోని కొన్ని వాక్యాలు చదివితే ఆయన స్వేచ్ఛా ప్రబోధం విదితమౌతుంది.

భారతీయుల పరిశ్రమలూ సామాజికవ్యవస్థలూ పునరుద్ధరించితేకాని వారు ప్రజాస్వామిక పద్ధతులలో రాజకీయంగా పురోగమించటానికి అర్హులుకారు అంటూ ఆంగ్లోఇండియన్లు చేసే వాదన హాస్యాస్పదం. అంతకంటే అవివేకమైన వాదనను వూహించటం కష్టం.

"యూరపుఖండంలోని మంచి దేశాలను అనుకరించకముందు మీ దేశీయులకు అన్నవస్త్రాలలోపం తీర్చండి" అంటాడు ఒక బుద్ధిశాలి

"రాజకీయ ప్రజాస్వామ్యం స్థాపించేముందు మీ సమాజంలో ప్రజాస్వామ్యం నెలకొల్పాలి' అంటాడు ఇంకో ప్రబుద్ధుడు. ప్రజాప్రభుత్వాలు సాగుతున్న దేశాలు సంపదతో సమానత్వంతో విలసిల్లుతున్నవి. కాబట్టి ప్రజాస్వామ్యం సంపాదించటానికి పూర్వం భారతదేశం వీటిని సాధించాలి అంటూ ఆంగ్లోఇండియన్లు నిర్దుష్టంగా తర్కిస్తున్నారు. పూర్వాపరసంబంధం లోపించిన ఈ వాదం హాస్యజనకం. మన దేశీయులలో అధిక సంఖ్యాకులుకూడా ఈ పద్ధతిగా వాదించటం దురదృష్టకరం. ఏది ముందు, ఏది తరవాత అనే ఆలోచనలేకుండా సామాజిక పారిశ్రామిక రాజకీయ పురోభివృద్ధులను కోరటం అర్ధరహితం. దారిద్ర్యంవల్ల జడీభవించి వ్యాధిపీడితమై, అంతులేని కరువుల పిడికిట్లో చిక్కిన భారతదేశం, జాతిమతవైరాలకు సంగ్రామరంగమై, చిలవలుపలవలుగా పెరిగిన కులభేదాలతో ఆత్మలను నిర్వీర్యంచేస్తున్న మూఢవిశ్వాసాలతో సతమతమౌతున్న భారతదేశం ప్రస్తుతం ముమూర్షువై పడివున్నది. ఈ దుస్థితినుంచి ఉద్ధరించుకోకుండా రాజకీయ పురోగతిని వాంఛించటం ధర్మవిరుద్ధం కాదా అని ప్రశ్నిస్తున్నారు.

బందేమాతరం పత్రికకు విరోధులుకూడా స్వచ్ఛమైన శక్తిమంతమైన ఆంగ్లవచనశైలిని ప్రశంసచేశారు. ఆ పత్రిక రాజకీయాలను మాత్రమే చర్చించలేదు. భారతదేశపు సంస్కృతీ సంప్రదాయాలలోని బహుముఖమైన విశేషాలను ప్రతిభావంతంగా వ్యాఖ్యానించే రచనలు ఆ పత్రికలో వచ్చేది. సమాజవ్యవస్థకు చెందిన సమస్యలను శ్రీ అరవిందుడు ఆ మూలాగ్రంగా ఆకళించుకుని చర్చించేవాడు.

కులతత్వంవల్ల కలుగుతున్న కీడు ఏమిటో 29-9-1907 నాటి బందేమాతరం పత్రికలో ఈ విధంగా విశదీకరించాడు.

"కులవ్యవస్థను గురించి శ్రీ బాలగంగాధరతిలక్ ప్రకటించిన స్పష్టమైన అభిప్రాయమును బెంగాలీ పత్రిక ప్రచురించింది. దక్కను నివాసియైన జాతీయ నాయకుడు ప్రస్తుతం సమాజంలోవున్న హెచ్చుతగ్గులవల్ల దేశానికి తీరనినష్టం కలుగు

తున్నదని భావిస్తున్నాడు హిందూమతమును బాగా అర్థం చేసుకుని జాతీయవాదాన్ని చిత్తశుద్ధితో ప్రచారంచేసే తిలక్ వంటి మహాశయుడు ఆ విధంగాఅనటం సమంజసం కులవిభజనకు ప్రాతిపదికలేమిటో మరిచిపోయి నీచమైనభావాలు ఆపాదించి అనంతర కాలములో అహంకారమూ ఆధిక్యమూ పెంచుకోటం జరిగింది. పుట్టుకవల్ల కొందరికి ఉన్నతి కలుగుతుందనుకోటం. అందరూ సమానులనే భావాన్ని స్వీకరించలేని అసహనం హిందూమతంచేసే ఉత్తమ బోధనలకు విరుద్ధం ప్రతి వ్యక్తిలోనూ అఖండమైన శాశ్వత పరతత్త్వమును సందర్శించటమే హిందూమతంలో మూల సూత్రం. దివ్యమైన ఏకత్వమును జాతిజనులందరిలోనూ దర్శించటమే జాతియ వాదపు పరమలక్ష్యం. రాజకీయ, సామాజిక, ఆర్థికవిషయాలవల్ల విభిన్నంగా అసమానంగా గోచరించే వ్యక్తులందరితోనూ కూడిన సమిష్టిభావమిది. భారతదేశం ప్రపంచానికి ప్రతిపాదిస్తున్న జాతీయవాదం అందరు వ్యక్తులకూ అన్ని మతాలకూ అన్ని వర్ణాలకూ, అన్ని వర్గాలకూ సమానత్వం సాధిస్తుంది, తిలక్ వర్ణించినట్లు జాతివిరాట్ పురుషస్వరూపం. ఆ శరీరంలో ఇవన్నీ విభిన్నమైనప్పటికీ ముఖ్యంగా వుండే అవయవాలు. మన మతం ఈ తత్వమునే నిత్యమూ ప్రచారం చేయాలి. భారతీయమతంలో తత్వంలో అంతర్గతమైన ఈ సత్యమునే జాతీయవాదులు ప్రబో ధించాలి. రాజకీయంగా నిరంకుశప్రభుత్వం ఈ స్వతస్సిద్ధమైన సమానత్వమును నిరాకరిస్తుంది. కనక దాన్ని మనం ఏవగించుకుంటాము. వర్తమానకాలంలో వక్ర మార్గంపట్టి సహజమైన సమానత్వమును సంఘంలోలేకుండా చేస్తున్నందువల్ల కుల తత్వమును వ్యతిరేకిస్తున్నాం. జాతిని రాజకీయంగా ప్రజాస్వామ్యపద్ధతి ప్రకారం పునర్నిర్మాణం చేయాలి. ఈ పునర్నిర్మాణం సమాజవ్యవస్థలకు కూడా తప్పనిసరిగా విస్తరిస్తుంది. ఈ పునర్నిర్మాణ కార్యక్రమం మనం రాజకీయాలకే పరిమితం చేస్తున్నామని వ్యతిరేకులు భావిస్తున్నారు కాని రాజకీయాలలో అది ప్రారంభమైతే అనివార్యంగా సమాజరంగానికి వ్యాపిస్తుంది. జాతీయవాది భవిష్యత్తును గురించి రచించే ప్రణాళికలలో జాతివల్లకాని జన్మవల్లకాని సంక్రమించే ప్రత్యేకాధికారాలకు తావులేదు. సర్వసమానత్వమును సాధించగల ఆ శుభదినంకోసమే కలలుకంటూ కృషి సాగిస్తున్నాడు.

అన్ని సమస్యలనూ ఆయన విశాల జాతీయ దృక్పథంతో పరిశీలించేవాడు. జాతీయతను గురించిన ఆయన భావం ఉదాత్తమైనది. తాత్కాలిక ప్రయోజనాల కోసం ఆ భావనను ఎన్నడూ కించపరచలేదు.

"దేశమునకు" ఆత్మనివేదనము చేసుకోటం మూలంగానే నిజమైన జాతీయ సమైక్యతను సాధించవచ్చు. మాతృభూమి స్వాతంత్ర్యమూ మహత్వమూ పరమ లక్ష్యములు. తక్కిన విషయములన్నీ వాటికి అనుబంధాలుగా విధేయాలుగా భావించాలి. భారతదేశంలో ప్రస్తుత మూడు రకాల ఆలోచనా విధానా లున్నవి. బ్రిటిషు వారి ఆధిక్యమును విలబెట్టటమే ఒక పక్షమునకు ప్రధాన లక్ష్యము. కొంచెం మార్పులుచేసి వారి ఆధిక్యమును కొనసాగించాలని ఇంకో పక్షం లక్ష్యం. భారత దేశాన్ని స్వతంత్రంచేసి బ్రిటను మీద ఆధారపడకుండా ఏదో ఒక రకమైన సంబంధం నిలుపుకోవాలని ఇంకోపక్షం ఆశయం. ఈ మూడింటిలో ఒక దానిని జాతి తన గమ్యంగా స్వీకరించేదాకా అధిక సంఖ్యాకుల నడుమ సమైక్యం సార్థకం కాదు కొద్ది మార్పులతో బ్రిటిషు ఆధిపత్యం కొనసాగించాలనే అభిప్రాయం ఒకప్పుడు ఆమోదం పొందిన ఆదర్శంగా వుండేది. అప్పుడు బాహ్యమైన ఏకీభావం కనబడేది. ఇప్పుడు నవ్యాశలు, నవీన సంకల్పాలు భారతజాతి చైతన్యంలో ప్రవేశిస్తున్నవి. ఇవి నిలబడటమో నిర్మూలం కావటమో జరగాలి. అప్పుడే నిజమైన సమైక్యభావం వర్ధిల్లుతుంది. దానిసత్వమునకు తలలువంచే సమైక్య భావం నిజమైనది కాదు."

1907 వ సంవత్సరంలో బందేమాతరం పత్రికనూ, రాజద్రోహ ప్రవృత్తి వ్యాపింపజేస్తున్నాడనే ఆరోపణతో దాని సంపాదకుడైన శ్రీ అరవిందునీ ప్రభుత్వం శిక్షించింది. ఆ సన్నివేశం దేశమంతటా అలజడి కలిగించింది. ఆ సందర్భంలోనే రవీంద్రనాథ్ ఠాకూర్ "ఓ అరవిందా! అందుకో రవీంద్ర వందనం" అనే ప్రఖ్యాత కవిత రచించాడు.

అధికారులు అరవిందుడే సంపాదకుడని నిరూపించలేక పోయారు. ఆయనను విడుదల చేశారు. ఆయనను నిర్బంధించటానికి ప్రభుత్వం ఇతర మార్గాలు వెదుకుతున్న సమయంలో సూరత్ కాంగ్రెసు సమావేశం జరిగింది. అతివాదులకూ మితవాదులకూ తీవ్ర ఘర్షణ వచ్చింది. మితవాదులు స్వదేశీ ఉద్యమాన్నీ, బహిష్కరణోద్యమాన్ని, బలపరుస్తూ తీర్మానించటానికి నిరాకరించారు. కాంగ్రెసు సమావేశం వాయిదా పడింది. జాతీయవాదులు ప్రత్యేకంగా సమావేశం జరుపుకున్నారు. సమావేశాన్ని చూడటానికి వచ్చిన హెన్రీ నెవిన్సను కథనం ఇది·

అరవిందుడు అధ్యక్షస్థానంలో గంభీరంగా మౌనంగా కూచొన్నాడు, భవిష్యత్తులోకి చూపులు సారిస్తున్నట్లు. తిలక్ చిన్న వాక్యాలతో స్పష్టంగా

వక్తృత్వప్రకర్షకాని ఉద్రేకం కాని లేకుండా ప్రసంగం సాగించాడు చుక్కలు పొడి చాయి. ఎవరో దీపం వెలిగించి పక్కనే పెట్టాడు

భారతీయ రాజకీయాల్లో కొత్తఘట్టం ప్రారంభమైనదని సూరత్ కాంగ్రెసు నిరూపించింది. పరప్రభుత్వానికి ప్రార్థనలూ విన్నపాలూ నివేదించే దశ దాటి పోయింది. త్వరితంగా ఈ పరిణామం కలిగింది తిలక్‌కూ అరవిందునికీ ప్రజల మద్దతు వచ్చింది. యువతరం అరవిందుని బాగా అభిమానించింది. వీరిరువురికీ లభించిన ప్రజాదరణ అధాసారణం. ఆలిపూరు కుట్రకేసు విచారణసమయంలో ప్రాసిక్యూషన్ పక్షాన వాదించిన నార్టను అక్కసు వెళ్ళబోసుకుంటూ ఇల్లా అన్నాడు. "ఎక్కడికి వెళ్లినా ప్రజలు అరవిందునికి రాజమర్యాదలు చేసేవారు."

స్వరాజ్య సముపార్జనమే చరమలక్ష్యమనే వాదమును బందేమాతరం ధైర్యంగా ప్రచారంచేసింది.

"ఒక విషయం విశ్వసిస్తున్నాము. దేశంలో చెలరేగుతున్న కల్లోలతరంగాలలో మునిగిపోకుండా కాపాడగల విశ్వాసమది. భారతభూమిని నిర్జీవదశనుంచి పునరుద్ధరించగల సర్వాతీత దివ్యశక్తిపట్ల అచంచల స్థిరవిశ్వాసమది. ఆమె ప్రాచీన వైభవమును మళ్ళీ వికసింపజేయటానికి పోరాటం సాగించాలనే దృఢనిశ్చల సంకల్పమది. స్వరాజ్యమే ప్రాణరక్షక మేఖల. స్వరాజ్యమే కర్ణధారి. స్వరాజ్యమే ధృవతార. ప్రాచీనమైన శాశ్వతమైన భారతీయస్వభావమును ఈనాటి సాంఘిక వ్యవస్థలు ప్రకటన చేయలేకపోతున్నవి. వాటి బంధాలలో చిక్కినజాతి స్వరాజ్యం సంపాదించుకోలేదు. కాబట్టి ఒక మహత్తర సామాజికవిప్లవం తప్పనిసరిగా రావాలి. పాతపైపోయిన జీర్ణవస్త్రములు వదిలివేసి భరతమాత నూతన వస్త్రములతో శోభలు వెదజల్లాలి తన ఆత్మశక్తిని ఆవిష్కరించటానికి అనుగుణంగా స్వరూపమును సరిదిద్దుకోవాలి."

కొంతకాలంపాటు పోలీసులు పైశాచిక చర్యలతో జాతీయవాదులను అణచివేశారు. బందేమాతరం అన్నంతమాత్రానికే గట్టిగా లాఠీలతో బాదేవారు. ఆ దమన నీతికి ఎటువంటి ఫలితాలువస్తాయో అరవిందుడు ఊహించాడు. ఒక జాతీయమహావేశమును అటువంటి చర్యలద్వారా అణగద్రొక్కటం, మొగ్గలోనే త్రుంచిచేశామనుకోవటం అవివేకమని ఆయన హెచ్చరికచేశాడు. కాని ప్రభుత్వం ప్రజలను భీతావాహంలో ముంచే కఠినచర్యలు సాగించింది. దానికి బదులు తీర్చుకోవాలనే తలంపుతో హింసావాదం చెలరేగింది.

జాతీయవాదులకు వ్యతిరేకులైన అధికారులను తుదముట్టించే ప్రయత్నాలు చెదురుమదురుగా సాగినవి. గవర్నరు ప్రయాణంచేస్తున్న రైలును కూల్చివేయాలనే ప్రయత్నం చివరికి కింగ్స్ఫర్డు అనే మేజిస్ట్రేటుకు చెందిన వాహనమనుకున్న శకటంమీద బాంబు విసరటానికి దారితీసింది. ఆయన స్వదేశీవుద్యమంలో పనిచేసే స్వచ్ఛందసేవకులకు అమానుషశిక్షలు విధించి అపఖ్యాతిపాలైనాడు. పోలీసులు తీవ్రంగా విచారణలు కొనసాగించారు. కలకత్తానగరంలోని మనిక్తలావనంలో విప్లవకారుల రహస్యకేంద్రమును కనుగొన్నారు. గౌరవనీయ కుటుంబాలకుచెందిన విద్యావంతులు అందులో పాల్గొంటున్నట్లు పోలీసుల నివేదికనుబట్టి వెల్లడిఅయింది.

ఆ యువకులనూ వాళ్ళ నాయకుడైన బారీన్ఘోషునూ ఒకనాటి తెల్లవారుజామున పట్టుకున్నారు. అదే సమయానికి అరవిందుని నివాసంవద్ద ఆయననుకూడా పట్టుకున్నారు.

ఆ కేసు విచారణ ఒక ఏడాదిపాటు నడిచింది. అలీపూరు కుట్రకేసుగా చరిత్ర ప్రసిద్ధమయింది. న్యాయాధిపతి బీచ్క్రాఫ్టుదొర. ఆయన కేంబ్రిజ్ విశ్వవిద్యాలయంలో అరవిందుల సహాధ్యాయి. క్లాసులో అగ్రస్థానం అరవిందునిది. ద్వితీయస్థానం బీచ్క్రాఫ్టుది ప్రతిభావంతుడైన విద్యార్థి ఆయన.

విచారణసాగుతున్న కాలంలో ఆకస్మికమైన విచిత్రసంఘటనలు జరిగాయి. ప్రాసిక్యూషనుకు సహకరిస్తున్న అధికారులిద్దరిని కాల్చి చంపేశారు. ప్రాసిక్యూషనుకు సహాయపడే సాక్షిని పట్టపగలే విప్లవకారులు చెఱసాలలో చంపారు. ఆ సాక్షి బతికివుంటే తమకు తప్పకుండా ఉరిశిక్షపడుతుందని ఆ యువక విప్లవకారులు గ్రహించారు. అంతటి ఆందోళనా అలజడీ కలిగిస్తున్న విచారణాసమయంలో అరవిందుడు నిర్లిప్తుడుగా సుదూర గగనానమెరిసే తారగా వెలుగొంది కారాగారవాసమున విచిత్రమైన ఆధ్యాత్మిక దివ్యానుభూతులు పొందినాడు. డాక్టరు శ్రీనివాసయ్యంగారు చెప్పినట్లుగా అది ఆశ్రమవాసంగా పరిణమించింది, ఏకాకిగా గదిలో బందీగావున్న సమయంలో అద్భుతమైన అనుభూతులు పొందినాడు

కారాగారంనుంచి విడుదలైన తరవాత ఉత్తరపరాలో చేసిన ప్రఖ్యాత ప్రసంగంలో ఇల్లా వర్ణించారు:

నా చుట్టూవున్న ఎత్తైన గోడలు నన్ను లోకానికి ఎడంగా వుంచుతున్నాయని తోచటానికి బదులుగా వాసుదేవుడే నన్ను పరివేష్ఠించినట్లు అనిపించింది. నా చెఱసాల గది ముందువున్న చెట్టు నీడలో నడయాడుతున్నప్పుడు ఆ వృక్షమే

వాసుదేవమూర్తిగా తోచి శ్రీకృష్ణుడే అక్కడ నిలబడి నామీద శీతలచ్ఛాయలు ప్రసరించినట్లు అనుభూతి కలిగించి. న్యాయాధిపతి స్థానంలో వాసుదేవుడే ఆసీనుడైనట్లు కనబడింది. ప్రాసిక్యూషన్ కౌన్సిలు రూపంలోకూడా శ్రీకృష్ణుడే ఆసీనుడైనాడు. నా ప్రియుడు, నా సఖుడు శ్రీకృష్ణుడే ఎదుట ఆసనం అలంకరించి మందహాసం చేస్తున్నాడు.

కారాగృహంలో జన్మించిన కృష్ణుడు అరవిందునికి చెఱసాలలో సాక్షాత్కరించి శ్రీకృష్ణజన్మస్థానమనే బిరుదు సార్థకం చేశాడు. 1939 లో అక్షరరూపమిచ్చిన అనుభూతిని ఆలిపూరు కారాగారంలో ఆయన పొందినారేమో!

భీకరమై శ్రీకరమైన విశ్వంలో
ఏకైకమైన జన్మసాఫల్య మిది,
దివికి ఆవల ఆలరారే శ్రీకృష్ణ పాదాబ్జములకై
భువి పొందే క్షుధార్త వేదన గుర్తించాను.
ఆ దివ్యలోచన శోభను కనుగొన్నాను
ఆ మోహన వంశీనాద ప్రణయావేదన విన్నాను.
నా హృదయంలో సకల శోకములనూ శమింపచేసిన
నితాంత విశ్రబ్ధపారవశ్యం ఒక్కసారిగా వచ్చి వాలింది.
దగ్గర దగ్గరగా వినవస్తున్నదా గానం
పట్టలేని సుఖంతో స్పందిస్తున్నది ప్రాణం
ప్రకృతి సర్వమూ ప్రభుని స్పర్శకోసం. పరిష్వంగం కోసం,
సంపూర్ణమిళనం కోసం ఆకాంక్షతో పరితపిస్తున్నది.
యుగ యుగములు నిరీక్షించిన మధుర క్షణం.
ఈ క్షణంలో విశ్వంలో అణువు అణువునా, పులకిస్తున్నది సంసిద్ధి సాఫల్యం.

కాని కారాగారంలో వున్న తరుణంలోనే స్వేచ్ఛనూ సాహసమునూ శ్లాఘిస్తూ అద్భుతమైన గీతం రచించాడు. దానిని పూర్తిగా ఉల్లేఖించకుండా వుండటం కష్టం.

## "ఆహ్వాన గీతం"

ప్రభంజనాలు అటూ ఇటూ విజృంభించినా
పర్వతాగ్రాలకూ బురదనేలలకూ తరలిపోతాను.
ఎవరు తోడుగా వస్తారు? ఎవరు ఆరోహిస్తారు?
వాగులు దాటుతూ మంచులో ముందుకు సాగుతూ వెంట ఎవరు వస్తారు?
తలుపులూ గోడలూ నిర్బంధించే సంకుచిత నగరాల పరిధిలో నివసించను నేను
నా శిరస్సుమీద నీలగగనంలో శ్యామసుందరమూర్తి
నా మీదికి పెనుగాలులూ తుఫానులూ విరుచుకు పడుతున్నాయి.
ఇక్కడ ఏకాంత సీమలో నాఖేలా విలాసం
ఆపదలే నాకు ఆప్త మిత్రులు.
ఎవరు నిరవధిక జీవనం కావాలంటారో
ఎవరు స్వేచ్ఛా జీవితం కోరుకుంటారో
వారంతా రావాలి
పవన ప్రకంపిత పర్వత సీమల్లో విహరించాలి
పర్వతాగ్రాల అధివసించే ప్రభంజన స్వామిని నేను
గర్వ గౌరవ విలసిత స్వేచ్ఛా ప్రబలశక్తిని నేను
నా సామ్రాజ్యంలో సహచరులై నాతోవిహరించ దలచిన వారందరూ
ప్రమాదాలకు ప్రియబాంధవులై దిగంబరులై తరలి రావాలి మరి.

ఈ తరుణంలో రచించిన మరొక కృతి ఎవరు? గంభీరమైన అనుభవమూ సరళ సుందరమైన అభివ్యక్తి ఇంత మనోహరంగా సంగమించిన సన్నివేశాలు అరుదు. ఈ కృతిని వ్యాఖ్యానించటం అనవసరం. వ్యాఖ్యానంవల్ల దాని శక్తిని సంకుచిత పరచటం సమంజసం కాదు. కొన్ని పంక్తులను ఉదహరించి ఆ సూర్యరశ్మిలో ఉత్తేజం పొందుదాము.

ఆకాశపు నీలిమను, అరణ్యాల శ్యామల శోభను
అంత చక్కగా దిద్దిన అదృశ్య హస్త మెవరిది?

గగన గర్భాంతరాళాన విదురించే గాలిబాలలను
కదపి కుదిపి విహరింపుమని పంపిన దెవరో?
హృదయాకాశంలో ప్రకృతి గహ్వరాలలో
వెదకినా కనరాదు ఆయన జాడ
ఆలోచనలు అమర్చిన బుద్ధికి
అందుతాడు ఆయన
వింత వన్నెల పుష్పాల సోయగంలో తిరిగి చూస్తుంది ఆయన మూర్తి
మెరిసే తారల తళుకుల వలలో చిక్కనదా చక్కని రూపం
పురుషుల శక్తిలో, మగువల సొగసులో
బాలుని హాసంలో, బాలిక చెక్కిలి కెంపులో
శుక్రగ్రహమును అంతరిక్షంలో పరిభ్రమింపజేసిన హస్తమే
కపోలముల కుటిల కుంతలములు సవరిస్తుందట

# ఆరో ప్రకరణం

మన నాయకులలో ఎక్కువమంది చిత్తశుద్ధిలేకుండా అధినివేశ స్వపరిపాలన కోరుతున్న సమయంలో ఆయన కాంగ్రెసు వేదికపై నిలబడి నిర్భయంగా స్వాతంత్ర్యమే లక్ష్యమని వాదిస్తూ వామపక్షానికి ప్రతినిధిగా వున్నాడు. సంపూర్ణమైన నిర్లిప్తచిత్తంతో కారాగారశిక్ష అనుభవించాడు. నేను 1913 లో కలకత్తాకు వచ్చేటప్పటికే అరవిందుడు ఆరాధ్యపురుషుడుగా పరిగణనపొందినాడు. ఇతర నాయకులెవరిని గురించీ ప్రజలు అంతటి పారవశ్యంతో ఆదరాభిమానాలతో ప్రశంసించటం నేను వినలేదు. ఆయనను గురించిన కథలెన్నో ఆ నోటా ఆ నోటాపడి విరివిగా ప్రచారం పొందినవి. అవన్నీ యదార్థాలు కావచ్చును.

సుభాస్ చంద్రబోసు
భారతీయ పరివ్రాజకుడు

## మానవ హితవాది

అలిపూరు కేసు విచారణ ఒక ఏడాదినడిచింది. చివరికి అరవిందుని నిర్దోషిగా గుర్తించి విడుదలచేశారు. విడుదలై బైటికివచ్చేసరికి విప్లవశక్తుల తీవ్రత దమన నీతివల్ల మందగించింది. కాని విశాలభారతరంగంలో రెండు అంశాలు స్పష్టంగా కానవచ్చినవి. ప్రజలకు స్వాతంత్ర్యమంటే ఏమిటో స్థూలంగా అవగాహనకలిగింది. మునుపటిలాగే అది కేవలం కల్పనకాదు. స్వాతంత్ర్యసిద్ధి ఎప్పుడు, ఏవిధంగా అనేవే ఆలోచించవలసినవి. మొట్టమొదట బ్రిటిషువారు భారతీయుల ఆందోళనకు దిగ్భ్రాంతులైనప్పటికీ క్రమంగా అర్థంచేసుకోగలిగారు. వాళ్ళకు తెలియకుండానే క్రమక్రమంగా భారతీయుల ఆకాంక్షలను సంతృప్తిపరచగల చర్యలు తీసుకోటం మొదలుపెట్టారు.

వందేమాతరం ప్రచురణ నిలిచిపోయింది. శ్రీ అరవిందుడు ఆంగ్లంలో కర్మయోగిన్, వంగభాషలో ధర్మ అనే వారపత్రికలను వెలువరించాడు ఈ పత్రికలు కేవలం రాజకీయమైనవికావు. మానవస్వభావంలో అంతర్గతమైన శక్తులను ఉద్దీపింప చేయటం వాటి లక్ష్యం. ఆ శక్తివల్లనే నిజమైన రాజకీయచైతన్యం ప్రభావిత మౌతుంది. కర్మయోగరహస్యం గ్రహించినందువల్లనే అర్జునుడు కురుక్షేత్ర సంగ్రామంలో పాల్గొన్నాడు.

భారతదేశం ప్రశాంతంగా వున్నప్పటికీ శ్రీ అరవిందుని స్వేచ్ఛగా వదిలితే ప్రమాదం రావచ్చునని ప్రభుత్వం భావించింది అప్పుడు వైస్రాయిగా వున్న మింటో ప్రభువు లండనులో భారత ప్రభుత్వ వ్యవహారాల కార్యదర్శిగా వుండిన మార్లే ప్రభువుకు "యావద్భారతదేశంలో అత్యంత ప్రమాదకర వ్యక్తి" అని అరవిందుని చిత్రించి దేశబహిష్కార శిక్షను సూచించగా మార్లే ఆమోదం తెలుపలేదు.

కొన్నాళ్లనుంచీ అరవిందుడు తన కార్యకలాపాలను సొంత ఆలోచనలను బట్టీ అంచనాలనుబట్టీ నిర్ణయించటం నిలిపివేశాడు. అతీతశక్తి ఆదేశం కోసం ఎదురు చూసేవాడు, ప్రభుత్వవర్గాలలో అరవిందుని దేశంనుంచి బహిష్కరించటం సముచితమా కాదా అనే మీమాంస జరుగుతునే వుంది. ఆ విషయం విన్నప్పటికీ ఆయన పట్టించుకోలేదు. 1910 వ సంవత్సరం ప్రారంభంలో ఒక సాయంకాలం అంతర్వాణి ఆదేశానుసారంగా ఆయన కలకత్తా సమీపానవున్న ఫ్రెంచి స్థావరం చంద్రనగరానికి ఆకస్మికంగా వెళ్ళినాడు, ఆలోచించలేదు. సంకోచించలేదు మరు నాటి ప్రభాత సమయానికి చంద్రనగరం చేరుకున్నాడు. కొన్నివారాలు గడిచిన తరవాత అవాణి ప్రబోధానుసారంగానే ఆయన పుదుచ్చేరికి తరలివెళ్ళటం జరిగింది.

కర్మయోగిన్ పత్రికను కొంతకాలం సోదరినివేదిత, ధర్మపత్రికను ఆయన అనుచరుడు యువకుడు నళినీకాంతగుప్త నిర్వహించారు.

భారతజాతి స్వాతంత్ర్యం తప్పకుండా సిద్ధించగలదని శ్రీ అరవిందుడు తన అంతర్దర్శనంతో నిశ్చయంగా గుర్తించాడు. ఆయన 75 వ జన్మదినోత్సవంనాడు ఆగస్టు 15 వ తేదీన 1947 లో భారతజాతి స్వాతంత్ర్యం సిద్ధించింది. ఆ సందర్భంలో ఆయన ఇచ్చిన సందేశం అనుబంధాలలో పునర్ముద్రింపబడింది.

ఆయనకు దిగంచలంలో నవ్యవనవీధులూ నూతన శాద్వల సీమలూ గోచరించాయి. జీవిత పరమలక్ష్య సాధనకు ఆయన ఉద్యమించాడు మానవజాతి పరి

వర్తనకు కారణభూతములైన గంభీర ఆధ్యాత్మిక విభూతిలో మునకలు వేసి పూర్ణ యోగతత్వమును ఆవిష్కరించి స్థాపించటమే ఆయన చరమలక్ష్యం.

ప్రభుత్వ వర్గాలలో చెలరేగిన కల్లోలం గందరగోళం క్రమంగా సమసిపోయాయి. కాని అరవిందుని అసంఖ్యాకులైన అనుచరులను ఆయన రాజకీయ రంగంనుంచి నిష్క్రమించటం చాలాకాలం బాధపెట్టింది. దేశవ్యాప్తంగా అరవిందునిగురించి తెలుసుకోవాలనే ఉత్కంఠరంరేకెత్తింది. దానిని తీర్చటంకోసం ఆయన కలకత్తానుంచి నిష్క్రమించిన ఏడాదిలోపలే ఆర్. పి. పాలిట్ అరవిందుని జీవితచరిత్ర ప్రప్రథమంగా రచించాడు. విదేశప్రభుత్వపు అత్యాచారాలనుంచి తప్పించుకోటానికే అరవిందుడు ఫ్రెంచి స్థావరానికి పారిపోయినట్లు కొందరు భావించారు వాళ్ళకు పాలిట్ స్పష్టంగా ధైర్యంగా సమాధానంచెప్పాడు ''బాహ్యంగా కనిపించే చర్యనుబట్టి ఆయన ఆశయం గ్రహించలేము. ఆ చర్య వెనకవున్న పరమార్థం గ్రహించాలి లౌకిక వ్యవహారరంగంలో వీరపూజలు అందుకోటంకోసం మన పారమార్థిక ప్రయోజనాలు పరిత్యజించవలెనా ?''

అరవిందునిగురించి ఇంకా వివరాలు తెలుసుకోవాలని ప్రజలు ఆరాటపడ్డారు. కొద్దిమంది అదృష్టవంతులు మాత్రం ఆయనతో ఉత్తరప్రత్యుత్తరాలు సాగించగలిగారు. నేతాజీ సుభాస్ ఇల్లా జ్ఞాపకంచేసుకుని చెబుతున్నాడు. "ఆధ్యాత్మిక రాజకీయవిషయాలలో ఆసక్తికలిగిన బృందాలకు అరవిందునివద్దనుంచి ఉత్తరాలు వచ్చేవి అవి ఒకరిదగ్గర్నుంచి మరొకరికి త్వరితంగా ప్రచారం పొందేవి మా బృందంలో ఒక సభ్యుడు అరవిందుని లేఖను బిగ్గరగా చదివితే మిగిలినవాళ్ళం వింటూ ఉత్తేజంపొందేవాళ్ళం. ఒక ఉత్తరంలో అరవిందుడు ఇల్లా రాసినాడు : "ఆ అలౌకిక విద్యుచ్ఛక్తికి మనం కేంద్రస్థానాలు కావాలి మనలో ఒకరు నిలబడినప్పుడు చుట్టూ వేలాదిప్రజలకూ జ్యోతిప్రసారం జరగాలి. ఆనందకాంతులకు ఆలవాలం కావాలి" మేమందరమూ రాజకీయరంగంలో జాతికి సేవచేయటానికి ఆధ్యాత్మిక ప్రదీప్తి అవశ్యమని గ్రహించాము

అనంతరకాలంలో చిత్తరంజనదాసు, టాగూరు ప్రభృతులు ప్రసిద్ధులు ఆయనను పుదుచ్చేరిలో కలుసుకున్నారు. వారి ప్రకటనలవల్ల ప్రజల మనస్సుల్లో సందేహాలు తొలగిపోయాయి. 1928 లో రవీంద్రనాధ్‌టాగూరు ఇల్లా రాశారు :

"ప్రథమ వీక్షణంలోనే ఆయన ఆత్మతత్వాన్ని అన్వేషించి సాధించినట్లు నాకు స్పష్టపడింది. చిరకాల సాధనాఫలితంగా ఆయన మౌనగంభీరశక్తిని ఉద్దీపింప

జేసే విభూతిని సంపాదించినట్లు గోచరించింది. అంతరంగంనుంచి వెలువడే తేజస్సుతో ఆయన ముఖం ప్రకాశిస్తున్నది. ఆయన ప్రశాంతమూర్తిని దర్శించగానే ఆయన ఆత్మను దుష్టమైన కుటిలమైన సిద్ధాంతాలు బంధించలేవనీ, జీవితమును గాయపరిచే సంకుచిత తత్వాలకు ఆయన ఆత్మశక్తి అతీతమైనదనీ గ్రహించగలము. సమస్త విశ్వంతోనూ సంబంధం కల్పించుకుని మానవాత్మ నిరవధికశాంతినీ స్వాతంత్ర్యమునూ సాధించేమార్గమును ఋషులు ఉపదేశించారు ఆ ప్రబోధమునే అరవిందుని వాణి ఆలపిస్తున్నది. ఆయనతో నేను అన్నాను. "మీ దగ్గరనుంచి మంత్రవాక్కు అందుకోవాలని నిరీక్షిస్తున్నాము. మీ వాణి పలికే ఆ మంత్రంద్వారా భారతదేశం సకల ప్రపంచమునూ ప్రబోధించగలదు.

చాలాకాలం కిందట తరుణప్రాయంలోవున్న అరవిందుని ఒకసారి దర్శించాను. "హే అరవిందా! రవీంద్రుని వందనం అందుకో" అని విన్నవించాను. నేడు పరిణత ప్రజ్ఞాన భాసురమైన మూర్తిని ప్రశాంత గంభీర పరిసరములలో దర్శించి మౌనంగా నా భక్తిగీతాలాపన చేస్తున్నాను. "అరవిందా! అందుకో రవీంద్రుని వందనం."

టాగూరు సత్యం గుర్తించగలిగాడు. అరవిందుడు జీవితాన్ని తిరస్కరించలేదు. ఈ భూఖండంమీద మానవులకు మహత్తర భవితవ్యమును సాధించే వుద్దేశంతోనే ఆయన రాజకీయాలనుంచి నిష్క్రమించారు. మానవుల నూతన పరిణామమును గురించిన ఆయన భావన, అతిమానసతత్వమును అవతరింప జేయటానికి సూచించిన సాధనా విధానము వెంటనే మనకు అర్థం కాకపోవచ్చు కాని పుదుచ్చేరినుంచి ఒక నవ్యకాంతి ప్రభవిస్తుందని కొందరు విశ్వసించారు. నిరీక్షించారు. అనతికాలంలోనే 1914 నుంచి "ఆర్య" పత్రిక ద్వారా జ్యోతి ప్రసారం ప్రారంభమయింది. ఆగస్టు 15 వ తేదీన ఆర్యప్రారంభం. ఆ సంవత్సరం చాలా ప్రముఖం. అరవిందుని ఆధ్యాత్మిక కార్యకలాపాలలో భాగస్వామిని శ్రీమాత పుదుచ్చేరి ఆ ఏడాదే వచ్చారు.

అరవిందుని ప్రముఖవచన కృతులన్నీ, ఆర్యపత్రికలో ధారావాహికంగా వెలువడినవి. దివ్యజీవనం, వేదరహస్యం, గీతను గురించిన వ్యాసాలు, మానవవృత్తం, మానవ సమైక్యతాదర్శం, భారతీయ సంస్కృతి సమర్థన, యోగసమన్వయం మొదలైన అనేక రచనల ద్వారా ప్రజలు అరవిందుని ఆధ్యాత్మికవాదం నేలను విడిచిన సాము కాదని గ్రహించారు. మానవుని ప్రేమించదలచినవాడు

మనిషి ప్రస్తుత స్థితిని మాత్రం అభిమానిస్తే చాలదు. ఆధ్యాత్మికత్వం ద్వారా మానవజీవితమూ ప్రపంచమూ సంపూర్ణ పరివర్తన పొందాలి. ప్రపంచంలో అహంభావమూ స్వార్థమూ ప్రేమ అనే మారువేషంలో సంచరిస్తున్నాయి. వాటి ప్రదర్శనలు కనిపిస్తాయి.

"బుద్ధిని అధిగమించినప్పుడే, అఖండమైన ఏకత్వపు విశాల ప్రశాంత సీమలో వసించినప్పుడే,

త్రికాలాతీతమైన ప్రేమ శాశ్వతానంద ప్రదం కాగలదు.

అప్పుడే మానవ మమకార బంధాల స్థానంలో దివ్యప్రేమ అలరారగలదు.

సావిత్రి VI, I

మానవుల సమున్నత భవితవ్యం దర్శించటంలో మానవజాతిపట్ల ఆయన అనురక్తి వెల్లడి అవుతుంది. ఆ భవితవ్య సాధనకోసం ఆయన ఎంతో కృషి చేశాడు, ఎన్నో భరించాడు. మానవ సమైక్యతాదర్శం అన్న గ్రంథంలో మానవ జాతిని వేధించే జటిల సమస్యల పరిష్కారానికి ఆయన సూచించిన రాజకీయ సాంఘిక సిద్ధాంతాలలో కూడా గాఢమైన అనురక్తి ప్రకటిత మౌతున్నది. సమైక్యం కోసం ఆవేశపూరితంగా చేసిన ఉద్బోధ కాదది. సంఘర్షణలకు వెరచిన సంప్రదాయ వాదులు చూపే జాగరూకత కాదది. సౌభ్రాత్రమును సాధించవలసిందని ముక్త కంఠంతో చేసే ప్రబోధమది. మొదటి ప్రకరణపు శీర్షిక "సమైక్యతాభిముఖం దాని అవసరాలూ ప్రమాదాలూ". అందులో ఆయన సమైక్యం కోసం జరిపే కృషికి ప్రాతిపదికమైన హేతువులను చర్చ చేశాడు.

సామాజికంగానూ రాజకీయంగానూ సాధించే సమైక్యం సర్వదా శ్రేయోదాయకం కాకపోవచ్చునని మరచిపోరాదు. శక్తిమంతుడైన వ్యక్తినీ సంపన్నమైన శోభావహమైన సమిష్టినీ సంతరించుకోటం కోసమే సమైక్యత అనే చక్రము కావాలి. గతకాలంలో మానవజాతి పొందిన అనుభవం ప్రకారంగా సుసంఘటితములైన సువ్యవస్థితములైన విస్తృత సమాజములలో జీవితం శోభామయంగా సుఖంగా కొనసాగదు. చిన్నప్రదేశాలలో చిన్నచిన్న వ్యవస్థలు ఏర్పరుచుకోటానికి దృష్టిని కేంద్రీకరించినప్పుడే సమిష్టి జీవితం సౌఖ్యంతో వైవిధ్యంతో సాఫల్యంతో విలసిల్లగలదు. అందినంత మేరకు గతచరిత్రను పరిశీలిస్తే మానవులు చిన్న స్వతంత్ర కేంద్రాలను ఏర్పరుచుకొని పరస్పర సంబంధాలు నెలకొల్పుకుంటూ ఒకే ఘూసలో

కరిగించిపోసిన ముద్దకాకుండా వున్నప్పుడే మానవజీవితం సంపన్నంగా కొనసాగింది: విలువైన ఫలాలను భావితరాలకు అందించగలిగింది."

కాని ప్రస్తుతకాలంలో భావాలు మారినవి, సాంఘికంగా, రాజకీయంగా ప్రభుత్వపరంగా మానవజాతి అంతా ఏకీకృతం కావాలనే వాదం వచ్చింది.

"వ్యక్తిగత జీవితమునూ పరిసరములనూ గ్రసించి నశింపజేసే ఒక మహా వ్యవస్థను కోరుతున్నారు. ఈ వ్యవస్థలో అవసరమైన స్వేచ్ఛ లోపించటంచేత మనుషులు గాలీ, వెలుతురూ, వానా లేక కృశించిపోయే మొక్కలమాదిరి తయారవుతారు. ఆ వ్యవస్థను చూసి మొదట ఆనందాతిశయం వెల్లువికినప్పటికీ, అది చల్లారిన తరవాత మానవజాతికి పురోగతి మందగించి, చలనం నశించి పతనం దాపురించ గలదు కడపటికి.

కాని మానవజాతి సమీకరణం అనేది ప్రకృతి ధర్మంగా కనబడుతుంది అది చివరికి సిద్ధించి తీరుతుంది. కాని ఆ సమైక్యమునకు అనువైన పరిస్థితులూ రక్షణలూ కావాలి. జాతి జీవశక్తిని సమూలంగా పరీక్షించుకోవాలి. ఏకీభావంలో సుసంపన్నమైన వైవిధ్యం వుండాలి

గతించిన యుగాలలో సంఘంలో వుండిన లోపాలనూ, ఏకీకరణం కోసం జరిపిన ప్రయత్నాలలోని లోపాలనూ అరవిందుడు నిశితంగా పరిశీలించాడు. చరిత్ర గమనంలోని అనుకూల ప్రతికూల శక్తులను అసాధారణమైన విష్వాక్షిక అవగాహనతో గమనించాడు. లోపాలకు పరిష్కార మార్గాలు సూచించాడు. సాంఘిక సంస్థలలోనూ ప్రపంచ వ్యవస్థలలోనూ రానున్న పరిణామాలను అభిదర్శిస్తూ ఇల్లా తేల్చి చెప్పాడు.

"మానవజాతి సమైక్యతినూ స్వచ్ఛందజీవనమునూ ఏకకాలంలో గుర్తించ గల మనస్తత్వమే ఇప్పుడు మనం కోరదగినది. అదే ఇప్పుడు మనను రక్షించ గలది. ఆ దిశగా పురోగమిస్తున్నశక్తి మానవుల మతమొక్కటే అనిపిస్తున్నది. మానవుల సమైక్యభావమును బలపరుస్తూ జాతి మనుగడను గుర్తిస్తూ మానవవ్యక్తిత్వాన్ని గౌరవిస్తూ స్వతస్సిద్ధమైన సమైక్యభావాన్ని కాపాడగలశక్తి మతానికేవున్నది. కాని ప్రస్తుతం బుద్ధికి ప్రాధాన్యమివ్వటంవల్ల మతం సమగ్రంగా కనబడటంలేదు. మతమనే భావమూ దాని ప్రభావాలూ శక్తిమంతములే, కాని జాతి రూపరేఖలు తీర్చిదిద్దగల జీవితాన్ని ప్రభావితంచేయగల సామర్థ్యంలేదు. మానవస్వభావంలో ముముక్షు పూర్తిగానూ ఇప్పుడు పదింట తొమ్మిదిపాళ్లుగానూ వున్న స్వార్థప్రవృత్తితో

పక్షం సంఘర్షణపడుతూ సామరస్యం కుదుర్చుకోవలసి వస్తున్నది. ఇంకొకవంక హేతుజ్ఞానంవైపు మొగ్గు చూపుతున్నందువల్ల యాంత్రికమైన పరిష్కారాలకు సిద్ధ పడవలసివస్తున్నది. హేతువాదం తన వలలో తానే చిక్కుకుపోతుంది. తర్క యంత్రం ఇంకొక కొత్తవిధానాన్ని భావనారంగంలో ప్రవేశపెట్టినప్పుడు పాత యంత్రం ధ్వంసమైపోతుంది. పాతదాని స్థానంలో ఒక కొత్తసిద్ధాంతమూ, కొత్త సూత్రమూ, కొత్త అనుష్ఠానమూ ప్రవేశిస్తాయి.

మానవజాతి భవిష్యత్తు ఆధ్యాత్మికధర్మం మీదనే ఆధారపడివుంటుంది. ఈ ధర్మం మామూలుగా భావించే విశ్వమతంకంటే భిన్నమైనది. బుద్ధిజనిత సిద్ధాంతాల మీదా విశ్వాసాలమీదా బాహ్యక్రతువులమీదా ఆధారపడే మతంకాదు. అటువంటి మతాలద్వారా సమైక్యం సాధించాలని మానవజాతి ప్రయత్నించి విఫలమయింది. సర్వమానవసమ్మతమైన మతవ్యవస్థవుండదు కొబట్టి వైఫల్యం తప్పలేదు. మానసిక మైన సిద్ధాంతమూ దానికి సచేతనస్వరూపమూ మతానికి అవసరం. అంతర్గతమైన తత్వం ఒకటేకావచ్చు. పారమార్థిక జీవనప్రకటనకూ వికాసానికీ ఇతర రంగాలలో కంటే స్వేచ్ఛ ఎక్కువ అవసరం. గుప్తమైన దివ్యతత్వంవున్నదనే విశ్వాసం క్రమ వికాసం పొందటమే మానవధర్మస్వభావం. ఆ దివ్యత్వప్రకటనకు మానవజాతి ఉత్తమసాధనం. మానవునిలోనే ఆ దివ్యత్వపు అభివ్యక్తి క్రమవికాసం పొంద గలదు. ఈ అభిజ్ఞకు అనుగుణంగా జీవితం సాగించి ఈ భూమిమీద దివ్యత్వపు సామ్రాజ్యాన్ని ప్రతిష్ఠించాలి. ఈ భావన మనలో రేకులు విప్పుకుంటే మానవు లందరూ సమానులనేదృష్టి జీవితాన్ని నడిపించే ముఖ్యసూత్రం అవుతుంది. అది సహకారసూత్రంకంటే గాఢమైనది. సమిష్టిజీవనమూ సోదరభావమూ సమానత్వమూ మనకు అలవడుతాయి. సాటిమానవుల శ్రేయస్సుమూలంగానే వ్యక్తిజీవితం సంపూ ర్ణత్వం పొందుతుందని గ్రహించుకోవాలి వ్యక్తిజీవితం స్వతంత్రంగా సంపూర్ణంగా కొనసాగినప్పుడే తన పరిపూర్ణత్వమూ శాశ్వతసుఖమూ వాటిమీద ఆధారపడి వర్ధిల్ల గలవని జాతి గుర్తించాలి. ఈ ధర్మాన్ని అనుసరించిన క్రమశిక్షణమూ ముక్తి మార్గమూ ప్రతివ్యక్తీ సాధించుకోవాలి. ఆ విధమైన లక్షణాలు జాతి అంతటిలోనూ వృద్ధిపొందాలి. ఈ మార్గానికి సంబంధించిన వివరాలన్నీ ఇక్కడ చర్చించటం అసాధ్యం. మనమార్గం ఈ దిక్కుగా పయనించటానికి ఉపకరించాలని సూచిస్తే సరిపోతుంది. ఇతరభావాలమాదిరిగా ఇదికూడా ఒక ఆశయంగా మిగిలిపోకూడదు. ఇది మన అంతర్గతధర్మం అయితే మనంచేసే ప్రయత్నాలన్నిటికీ అది గమ్యం కావాలి. ప్రాతిపదికమైన, అంతర్గతమైన, సంపూర్ణమైన, యథార్థమైన సమైక్యతమ

సాధించటానికి ఉపకరణంకావాలి. మానవజీవన సమైక్యతకు అది పదిలమైన పునాది కావాలి. మానసిక సమైక్యమును సాధించగల ఆధ్యాత్మిక సమైక్యత మనకు అవసరం. ఇది బుద్ధిగతమైన బాహ్యమైన ఏకీభావంతో ముడిపడివుండదు. యాంత్రిక విధానాలద్వారా తెచ్చుకునే ఏకత్వంకాదు. అంతరంగజీవితంలో స్వేచ్ఛతోకూడిన మార్పులనూ వాటిని ప్రకటించుకునే పద్ధతులలో స్వాతంత్ర్యమునూ సమకూర్చగల భద్రమైన సమైక్యమును సాధించుకోవాలి. ఈ సమైక్యం పునాదిగా ఉత్తమ జీవన విధానం విలసిల్లాలి.

ఈ సత్యమును మానవులు శీఘ్రంగా గ్రహించగలిగితే సమైక్యతాసమస్యను పరిష్కరించగలము. అంతర్గతసత్యంతో మొదలుపెట్టి బాహ్యస్వరూపాలకు విస్తరించే గంభీరమైన యథార్థమైన సమైక్యత సాధించగలుగుతాము. ఈలోపుగా సమైక్యతను సాధించే యాంత్రికపద్ధతులు కొనసాగవలసిందే. కాని మానవభవితవ్యం ఆశాజనకం కావాలంటే ఈ తత్వమును అవగాహనచేసుకున్న వ్యక్తులసంఖ్య పెరగాలి. యాంత్రికమైన పరిష్కారాలు తాత్కాలికమైనవనీ, ఆశాభంగం కలిగిస్తాయనీ గ్రహించిన ఆధ్యాత్మికవేత్తలసంఖ్య హెచ్చి ఆధ్యాత్మికశక్తి ఆవిర్భవించి అత్యుత్తమ పరిపూర్ణసుఖం దిక్కుగా మానవజాతిని నడిపించాలి.”

భావములూ దృశ్యములూ అనే గ్రంథంలోని కొన్ని పంక్తులను ఉల్లేఖించి వాటిని మననం చేసుకుంటూ ఈ ప్రకరణం ముగించుదాము.

“మునుపు సాధించని నూతన విషయాలేమున్నాయి? ప్రేమను పెంచుకోవాలి. ఇప్పటిదాకా ద్వేషమునూ స్వార్థసౌఖ్యములనూ పెంచుతున్నాం కదా.

జ్ఞానం : ఇంతవరకూ దోషభూయిష్ఠంగా భావించాం. గ్రహించాం

ఆనందం : ఇప్పటిదాకా సుఖాలూ, బాధలూ, ఉదాసీనతా సాధించాం.

శక్తి : నేటివరకూ దౌర్బల్యమూ, కృషీ, పరాజిత విజయమూ మనకు దక్కినవి.

జీవనం : ఇప్పటివరకూ మనకు పుట్టుకా, పెంపూ, మృత్యువూ మాత్రమే లభించింది.

సమైక్యం : ఇప్పటిదాకా మనం సమరమూ సహవాసమూ మాత్రమే సాధించాము.

ఒక్క ముక్కలో చెప్పాలంటే దివ్యత్వం సాధించాలి. ఆ దివ్యాకృతికి అనుగుణంగా మనం నవరూపకల్పన చేసుకుందాం.

---

# ఏడో ప్రకరణము

విచలిత సృష్టి శిఖరాగ్రమున సముజ్వలంగా
ఉషాదేవి శబలకాంతి పరివేషం సంతరించి
మహిమాన్వైభవ బీజములను ఘడియల్లో నిక్షిప్తం చేసింది

శ్రీ అరవిందులు—సావిత్రి

## ప్రణయం—ప్రభాతం

ప్రియా, ప్రళయం అంతమయింది, ప్రమాదం గడిచిపోయింది

తేలిపోదామిక రాణీ! బంగరు పొలాల నడుమగా శ్యామల స్వర్ణవనసీమలలో, సుందర చాంపేయ స్వప్నాలలో విహరిద్దాము.

ఓ వసుంధరావిభవరమా! నీ దివ్యధామ భాసురద్వారాలు తెరుచుకుని స్వాగతమిచ్చేదాకా ఈ రమణీయ రాజ్యవిహారం చేద్దాము.

ఈ పంక్తులు 1915 లో అరవిందులు రచించిన వాసవదత్తనుంచి ఉల్లేఖించినవి. సోమదత్తుని కథాసరిత్సాగరంలోవున్న ఒక ప్రేమగాథను మధురమైన రూపకంగా మలచుకున్నారు. నిరవధికంగా బంగారుకలల్లో తేలిపోదామనే కథానాయకుని ఆకాంక్షతో రూపకం ముగుస్తుంది. ఆ ప్రాయంలోనే 'రోడోగున్' అనే విషాద నాటకాన్నికూడా రాశారు. రచనల్లో ఇదొక్కటే విషాదాంతం. క్లియోపాత్రా భర్త మరణించాక ఆవిడ కుమారులు ఏంటియోకస్, టిమొక్లీసు దేశబహిష్కార శిక్ష పూర్తికాగా స్వదేశానికి తిరిగివచ్చారు. రాజప్రాసాదంలో బందీగా వున్న రోడోగున్ అనే లావణ్యరాశిని ఇద్దరూ ప్రేమిస్తారు. ఇద్దరిలోనూ వీరుడైన ఏంటియోకసును రోడోగున్ ప్రేమిస్తుంది. కాని దురదృష్టవశాన తల్లి మొదటినుంచీ అతన్ని అపార్థం చేసుకున్నది. అసూయాగ్రస్తుడైన టిమొక్లీసు సోదరుణ్ని చంపిస్తాడు. ఆ వార్తవినగానే విస్తుపోయి రోడోగున్ మరణిస్తుంది. ఏంటియోకసు రోడోగున్‌ల సమక్షంలో ఒక సన్యాసి ఏనాడోచెప్పిన జోస్యం నిజమవుతుంది.

"నువ్వు రాజువుకాలేవు. ఘనత, ప్రతిభ, గర్వం, శక్తి వున్నప్పటికీ చివికి తలవొంచి పిడుగుపడిన చెట్టులాగా నేలకూలిపోతావు. ఈ హెచ్చరిక చేయటానికే వచ్చాను."

బాహాటంగా ఆవేశాలను ప్రదర్శించినప్పటికీ కడపటికి టిమొక్లీసు సాధించిన దేమిటి? జీవచ్ఛవంగా బతకటంతప్ప మరేమీలేదు. జీవితం నిరర్థకంగా పరిణమించింది. బిగ్గరగా కేకలుపెట్టే ఉన్మత్తుని అర్థరహితప్రలాపంగా తోచింది.

"ఏదో నాలో తెగిపోయింది. ఏ వైద్యుడూ దానిని అతకలేడు. ఓ నికనూరు రాజకుమారా! సిరియా రాజరక్తంతో జన్మించావు. నీ వంశంలో విష్కళంక కీర్తి శోభితుడు సెల్యూకసు ఉదయించగలడు. సోదరా, సోదరా, చివరికి ఇల్లా పరిణమిస్తుందని కలనైనా తలపోయలేదు. ఉదయాస్తమయవేళల్లో ఈజిప్ట్ ఉద్యానవనాలలో కలిపి ఆటలాడుతూ విహరించినప్పుడు, మెడచుట్టూ చేతులువేసుకుంటూ టోలెమీ చక్రవర్తి వళ్ళతోటల్లో రెండు శరీరాల్లో స్పందించే ఏకైకహృదయంతో నడయాడినవేళల్లో ఈ విధంగా పరిణమిస్తుందని వూహించలేదుకదా! ఇప్పుడు మనం శాశ్వతంగా విడిపోయాము. ఈ తరుచ్ఛాయల్లో ఏకాకినై కాలం వెళ్ళదీయాలి. నేను ఒంటరినై తిరుగాడుతుండగా మీరిరువురూ పుష్పశయ్యలపై సుఖపరిష్వంగంలో సుందరవనపవనాల గుసగుసలు ఆలకిస్తూ హాయిగా వుంటారుకదా!"

అజ్ఞానంతోనిండిన సంక్లిష్ట మానవజీవితంలో సన్మార్గాన నడిపించగల ఆకాంక్షలకు బదులుగా వక్రమైనదురాశ మనిషిని వశం చేసుకుంటున్నది. నీచ కార్యాల సుడిగుండాలనుంచి వాటి ఫలితాలనుంచి కర్మానుభవంనుంచి తప్పించుకుని బైటపడేదాకా మనిషికి విముక్తికలగదు. నిర్దాక్షిణ్యములైన విధిచక్రాలకిందపడి ఎందరో వీరులు, ఎన్నో నాగరికతలు తునాతునకలు కాలేదా! తరుణదశలో ప్రారంభించి అసంపూర్ణంగా విడిచిన 'ఇలియన్' అనే కావ్యంలో అరవిందులు ట్రోజను యుద్ధగాథను స్వీకరించారు. పతనోన్ముఖమైన ట్రాయ్ నగరంమీద సూర్యోదయమౌతున్న సన్నివేశంలో విధివిలాసం విషాదకరంగా మహత్తరంగా గోచరిస్తున్నది.

"ఉషాదేవి శోభామయ చేలాంచలాలను కొండలమీదా కోనలమీదా పరుచుకుంటూ తరలివస్తున్నది బంగరుపాదాలు ధగధగ మెరిపిస్తూ.

నిష్పాక్షిక దృక్కులను ప్రసరిస్తూ అన్నిటినీ అవలోకిస్తూ విజయ పరాజయాలను వీరులకు సమభావంతో అందిస్తూ సాయంసంధ్యవిలాపాలను నరకు

చేయక కాంతిప్రదాతగా ఇలియన్ నగరపు అద్భుతవిభవాలకు మురిసిపోత ఉదా సీనంగా భవితవ్యస్వరూపిణిగా ఉషస్సు విచ్చేసింది.

ఉషారాగంలో జ్వాలలవలె ఎగసిన సౌధస్వచ్ఛగోపురాలు, సూర్యుని కాంతి పీఠాతంత్రులై భాసిస్తున్న శిల్పసుందర శిఖరాగ్రాలు, జాతి సృజించిన నిర్మాణాలు, జనుల అనురాగానందాలు, వీటికి అతీతంగా వెలుగొందుతున్నది ప్రభాతం.

రాజవీధులలో, గృహవాటికలలో, విపణివీధుల్లో దైవమందిరాలలో కడసారి వెలుగుజిలుగులు మెరిపిస్తున్నది.

మృతులు కానున్న పురుషులనూ, శోకభారం మోయబోతున్న వనితలనూ, అగ్నిజ్వాలలకూ మారణాయుధాలకూ ఆహుతికానున్న సౌందర్యశోభలనూ అవలోకిస్తున్నది.

అమరులు రక్తాక్షరాలతో లిఖించిన వినాశనపత్రాలను విప్పుతూ అభిశప్తమైన జాతిభవితవ్యంపైన అతిక్రమించింది అదృశ్యమైన పరిసరములలో.

చిరునవ్వులతో సాగిపోయింది కరుణలేని మరణంలేని దివ్యమందహాసంతో కదిలివెళ్ళింది.

తమకు మరణం లేకున్నా మృత్యువుకు కారకులు.

ప్రభాతవేళ నాటిన బీజాలు రాత్రిసమయానికి కోతకు సిద్ధమౌతాయి పండిన పైరుమాదిరిగా.

ఎరిక్ అనే రూపకంలో విధి మరొకరూపంలో గోచరిస్తుంది. (అరవిందుడు రచించిన సంపూర్ణ నాటకాలు అయిదూ, అసంపూర్ణమైనవి మూడూ. విముక్తిదాత పెర్స్యూస్, వాసవదత్త, రోడోగున్. బసోరావజీరులు, ఎరిక్ అనేవి సంపూర్ణమైనవి. (బట్ వంశం, మిల్లులో కన్య, ఎడూర్ రాజకుమారుడు అనేవి అసంపూర్ణమైనవి) ఎరిక్ నాటిక 1912 లోనో 1913 లోనో రచించబడింది. నాటకాంతంలో నాయకుడు ఎరిక్ నాయిక అస్లాంగును కలుసుకుని సమ్మేళనంలోకలిగిన సంతోషం వెల్లడిస్తాడు. అప్పుడు నాయిక ఇల్లా అంటుంది

"ఇది విధినిర్ణయం. ప్రియా! మనకు ఇది పునర్జన్మ" ప్రేమ మహిమవల్ల నాయికలో పరివర్తన కలుగుతుంది. అస్లాంగుకు ఎరిక్ పట్ల ద్వేషం వుంటుంది. అతన్ని తుదముట్టించే ఉపాయంకోసమే అతన్ని కలుసుకోబోతుంది. చూసిన మరుక్షణంనుంచీ మధురవేదనలో చిక్కుకుంటుంది. ఎందుకంటే

"ఎరిక్ మహాశూరుడు. అతని ముఖమూ రూపమూ దివ్యమైనవి. మెరిసే కళ్ళతో పాలరాతిప్రతిమలా వున్నాడు" కాల్కమాన తన ప్రేమద్వారా ఎరిక్ స్వభావంలో మార్పుతెచ్చింది నాయిక. దీర్ఘదృఢకాయుడైన ఎరిక్ కరుణాళుడుగా, సాహసికుడుగా, ఘనుడుగా మారుతాడు.

రోడోగున్‌లో నాయకుడు ఏంటియోకసు వీరలక్షణాలు కలవాడేకాని దురాశాపరుడు అహంభావపూరితుడు. కాబట్టి అతనిమీద ప్రేమప్రభావం ప్రసరించలేదు. సన్మార్గమునకు మరలించగలిగినది, ఉదాత్తలక్షణాలు కలిగించేది ప్రేమశక్తే.

"కాలంవల్ల ఏర్పడే అఖాతాలను పూరించగలిగినది ప్రేమయే.

ప్రేమసూత్రం ద్వారానే మానవులకూ గగనతారకలకూ అనుబంధం"

—ఎరిక్

కాని ప్రేమపేరుతో నకిలీసరుకు చాలా చెలామణి అవుతున్నది. అసలైన ప్రేమ లక్షణాలేమిటి ?

"జీవించటం, ప్రేమించటం అపారమైనవి.

అనంతసీమలనుంచి ప్రసరించే వైభవం ప్రేమ.

ప్రేమనామమునూ, రూపమునూ, ఆనందమునూ అనుకరిస్తూ సంకుచితపరిచే నీచశక్తులున్నవి. వాటివల్ల ప్రేమ పేలవమై వికృతమౌతున్నది.

ఆయినప్పటికీ ప్రేమదేవతవల్లనే అన్నిటా అంతటా పరివర్తనం కలుగుతున్నది. —సావిత్రి.

మానవజీవితంలో పాలిపోయిన ప్రేమకుసుమాలద్వారా ఎన్నో అద్భుతాలు సంభవిస్తున్నవి. ఆధ్యాత్మిక రవిరశ్మిసోకి పునీతమైన జ్ఞానప్రదమైన ప్రేమానుభూతి ఇంకెన్ని మహిమలు మనుషుల బతుకుల్లో చూపగలదో మరి!

"బుద్ధిని అధిరోహించి, విశాలప్రశాంత ఏకత్వభావనలో అధివసించి శాశ్వతానంద సంధాయకమైన అమరప్రేమను, మానవ మమతాబంధాలకు బదులుగా నెలకొనగల దివ్యప్రేమను అప్పుడే అనుభవించగలుగుతావు." —సావిత్రి.

కడపటికి మానవుడు ప్రేమికుడు, ఈశ్వరుడే ప్రియతముడు అనే సత్యం ఋషి అనే కవితలో ఆవిష్కరించబడింది. అరవిందులు రచించిన ఋషి అనే దీర్ఘకావ్యంలో కథావస్తువు ఇది. ఆర్కిటిక్ ఖండం వర్ధిల్లుతున్న ప్రాచీనయుగంలో

మనువు జ్ఞానాన్వేషణచేస్తూ ధృవస్థానంలోవున్న ఒక ఋషిని ఆశ్రయిస్తాడు. జ్ఞానమునుగురించి అనేక చిన్నవిషయాలుచెప్పి చివరికి మానవుడు తెలుసుకోదగిన పరమార్థమేదో బోధిస్తాడు.

అహనా అనే కృతిలో దివ్యప్రభాతం అవనిలో అవతరించిన శుభముహూర్తం వర్ణించారు. పర్వత సానువులలోనూ లోయలలోనూ జీవితపు సంకులసంఘర్షణల మధ్య జిజ్ఞాసువులూ, అధికార శిఖరారోహకులూ ఆనందాన్వేషకులూ పరిశ్రమిస్తూ నిరీక్షిస్తూవుంటారు. ఉషాదేవి అహనా ప్రేమసందేశాన్ని అందించి వివరిస్తుంది.

"ఇంద్రియలోలులైన మర్త్యుల ఆక్రందనమా! నిరంతర కామనావ్యథిత హృదయమా! ఆత్మతత్వమును ఇంద్రియవాంఛలతో పరాభవించి ఇరుకుగోడలు కట్టూకునే నరుడా!

చివరికి నేను అవతరించాను. నిన్ను చంచలభయదమైన, మధురంగా వంచిస్తున్న, అమృత హాలాహలాలను అందించి ప్రలోభపెట్టి వదిలిన ఒక శక్తి వున్నది.

మనిద్దరం కలిసి ఆ వేణువునూ నిరంతర మురళీగానలోలునీ వశం చేసుకుందాము.

మానవుడా! వాసనలేని పుష్పాలకిరీటం ధరిస్తున్నావు. వేదన కలిగించే ఆనందాలకోసం వెంపరలాడుతున్నావు.

ఆలోకించు నా ఆగమనం. నా వెంట వస్తున్నది జ్ఞానం. సమస్తావకాశములనూ మేఘగర్జనలతో మారుమ్రోగిస్తున్నది. శక్తి దేవదూతగా వస్తూ ఆనందమును వక్షాన ధరించి నీ బాహువులకు అందిస్తున్నది.

ఆమె ఆననమును శిశువదనమునూ పుష్పవికాసమునూ అమాయకంగా వీక్షించినట్లు, పూర్వకాలంలో ఈడెన్ వనములో విరిసిన స్వేచ్ఛతో ఆమె విలాసాలకు వెరవని మనస్సుతో దర్శించు. ఆకలిగొన్న సివంగిలాగా నీ వాంఛలను నేను వశంచేసుకుని మింగివేస్తాను. ఈవిధంగా నీ బాధలు కొనసాగవు; వ్యామోహంలో చిక్కి వినర్జితుడివై నువ్వు ఆక్రందించేపనిలేదు.

ఆయన పాదాలకు నేను బందాలు వేయగలను. ఆయనను బంధించగల సంకెల కొనివచ్చాను.

ఆనంద విధానమైన బృందావనానికి పద పోదాం. నేను బోధించే నృత్యం త్వరత్వరగా అభ్యసించు. శ్యామసుందరుడు మన దాసుడు మన అధినాథుడు.

జాగృతిపొందిన పరవశాత్మతో ఆ వంశీనాదాన్ని అనుసరించు. అవమాన కరమైన మధురిమకు లొంగిపోయే ఆనందాన్ని కాళ్ళతో మట్టగించు.

అప్పుడు అవగతమౌతుంది ఆ నృత్యపరమార్థం. అప్పుడు గాయకునీ గానమునూ అవగాహన చేసుకోగలవు.

ఉరుములలో దాని లయ నిశ్వాసాలు వినగలవు. మెరుపులలో ఆ కరాంగుళుల స్పర్శసౌకి పులకించిపోగలవు.

బృందావన తరు పల్లవముల గుసగుసలూ, యమునాతరంగ దోలితమైన ఆనందలహరులూ గుర్తించుకొంటూ రాసలీలానృత్యంలో చేరిపోయి ఎన్నటికీ తరగని ఆనందపారవశ్యం అనుభవించగలవు."

దివ్యప్రభాత అవతరణమంటే నిజమైన ప్రేమ మహిమావైభవమును గ్రహించటానికి శ్రీకారమన్నమాట.

# ఎనిమిదో ప్రకరణము

భూతకాలపు మహిమావిష్కారం ద్వారా ఆమె భవితవ్యపు ఆశలను గుర్తించుకోగలదు.

శ్రీ అరవిందులు.

## పూర్వభారత వైభవ ఆవిష్కరణ

"మానవ పురోగమనంలో రానున్న గొప్ప దశలో భౌతికంగాకాక ఆధ్యాత్మికంగా, మానసికంగా ముందుకు సాగవలసివున్నది. విముక్తమైన ఆసియాఖండమూ, స్వతంత్రమైన భారతదేశమూ ఈ ప్రగతికి నాయకత్వం వహించాలి. కాబట్టి ప్రపంచ శ్రేయస్సుకోసం మనం స్వాతంత్ర్యంకొరకు పోరాడవలసిందే. భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రాణం. ఆమె సుఖంగా శోభామయంగా విలసిల్లగలగటానికి స్వాతంత్ర్యం అవసరం. ప్రపంచ శ్రేయస్సుకోసం జీవించటానికి ఆమెకు స్వరాజ్యం కావాలి. భౌతిక రాజకీయ ప్రయోజనాలు కోరుకునే బానిసలజాతిగా కాక సమస్త మానవజాతికీ ఆధ్యాత్మిక వైతికాభ్యుదయం సమకూర్చటంకోసం భారతీయులు స్వతంత్రులు కావాలి."

భారతీయ స్వాతంత్ర్య సంగ్రామపు తొలినాళ్ళలో అరవిందుడుచేసిన ప్రకటన ఇది. ఆయన గురుతరబాధ్యత స్వీకరించవలసివచ్చింది. "ఆర్య" పత్రికలో ఎక్కువ పుటలను ప్రాచీన భారతీయుల నిర్మలమైన పారమార్థికదృష్టినీ, వారి సాంస్కృతిక సాహిత్యసంపదల విశిష్టతనూ విశదీకరించటానికి వినియోగించారు. ఇప్పుడా రచనలు, గీతావ్యాసములు, వేదవిశిష్టత, భారతీయ సంస్కృతికి పునాదులు అనే సంపుటాలుగా క్రోడీకరించబడినవి.

జేమ్సు కజిన్సు "ఆంగ్లసాహిత్యంలో నవ్యమార్గాలు" అనే గ్రంథం రచించగా దానిని పర్యాలోకనచేస్తూ "భవిష్యత్కవిత" గ్రంథాన్ని రాయటానికి పూనుకున్నారు అరవిందులు. విలియం ఆర్చర్ భారతీయసంస్కృతిని చులకనచేయగా సర్ జాన్ వుడ్రూఫ్ దానికి సమాధానం రాశాడు. భారతీయసంస్కృతిని గురించి

విమర్శించటానికి ఆర్చర్‌కున్న అధికారం ఏమిటంటే ఆత్మవిశ్వాసపూరితమైన ఘన తరమైన అజ్ఞానమే. ఆ గ్రంథ విమర్శన "భారతీయసంస్కృతికి పునాదులు" అనే పుస్తకం రాయటానికి దారితీసింది.

ఆర్చర్ దృష్టికి భారతీయులు తత్వచింతనలో మతంలో సాహిత్య చిత్రకళా శిల్పాదులలో, పవిత్రగ్రంథాలలో సాధించిన మహోన్నతవిజయాలు అల్పంగా తోచినవి. వాటిని మొత్తంగా కట్టకట్టి జుగుప్సాకరమైన అనాగరికతకు సూచనలుగా ఖండించివేశాడు. ఆర్చర్ అవివేకంవల్ల చేసిన పొరబాటును ఎత్తిచూపి అసలు విషయాన్ని శ్రీ అరవిందులు ఈ విధంగా పరిశీలనచేశారు.

"భారతజాతి నాగరికమైనదా కాదా అనేది ప్రశ్నకాదు. మానవ నాగరికత ముందడుగువేయటానికి ప్రాచీన భారతీయసంస్కృతిని ప్రేరేపించిన సూత్రాలు తోడ్పడగలవా? అలనాడు ఐరోపాఖండంలో విలసిల్లిన బుద్ధి ప్రధానమైన తత్వం, నేడు తలయెత్తిన భౌతికవాదం మానవపురోగతికి దోహదం చేయగలవా అని ప్రశ్నించుకుందాం. ఆత్మనూ బుద్ధినీ శరీరమునూ సమన్వయించే సూత్రం స్థూలమైన భౌతికతత్వంమీద ఆధారపడి అత్యల్పమైన నీరసమైన పారమార్థికతత్వంతో కూడి వుండవలెనా? లేక ఆధ్యాత్మికశక్తి ప్రాధాన్యం వహించి మేధాశక్తినీ, శరీరమునూ బుద్ధినీ సమన్వయించే సముదాత్తకృషిని ప్రేరేపించి విజయవంతమైన ప్రవర్ధమాన మైన ప్రశాంతచిత్తమును సాధించవలెనా? తన ప్రాచీనాదర్శములను శక్తిమంతంగా, సంపూర్ణంగా ప్రత్యక్షంగా ప్రకటించేవిధంగా భారతదేశం తన సంస్కృతీస్వరూపా లను మలచుకుంటూ నిలబడగలగాలి. భారతదేశం ఈ సమన్వయం ద్వారా సాధిం చిన విజయం తరంగాలుగా విస్తరించి ప్రపంచమంతటినీ ఆక్రమించుకోవాలి. పూర్వ యుగాలలో భారతదేశం ప్రపంచానికి జ్ఞానదీప్తి ప్రసరించి నాయకత్వం వహించింది. విభిన్నమైన సాంస్కృతిక విధానాలనడుమ సంఘర్షణ కొంతకాలం సాగుతుంది. కాని బాహ్యంగామాత్రమే ఇది సంఘర్షణగా తోస్తుంది. పశ్చిమదేశాలనుంచి వెలు వడుతున్న ఉత్తమ భావాలకు భారతదేశంనుంచి సహకారమే లభిస్తుంది. కాబట్టి ఉన్నతస్థాయిలో జరిగే సమన్వయానికి నాంది పలుకుతూ సమైక్యమునకు రంగం సిద్ధపరుస్తుంది."

భారతీయ సంస్కృతిలోవున్న గాఢమైన ఆధ్యాత్మిక స్వభావమునూ, చరిత్ర లోని విఘాతములనూ కాలచక్ర పరిభ్రమణములనూ తట్టుకొని నిలబడగలిగిన వివిధాంశములనూ పరిశీలించారు అరవిందులు.

యుగయుగాంతములనుంచీ వర్ధిల్లిన భారతదేశం గతించిపోలేదు. ఆమె సజీవవాణి అంతరించిపోలేదు. ఆమె జీవంతో తొణికిసలాడుతూ తనకోసమూ మానవకోటికోసమూ మనగలుగుతున్నది. ఇప్పుడు మేలుకొలుపవలసినది ఆంగ్ల ప్రభావ వివశులైన ప్రాచ్యులనుకాదు. వారు పాశ్చాత్యులకు విధేయ శిష్యప్రాయులై అక్కడి విజయ పరాజయములను పునరావృత్తం చేస్తారు. తన స్వరూపమును ప్రకటించగల గంభీరమైన అత్యంత ప్రాక్తనమైన శక్తిని ఇప్పుడు మేలుకొలపాలి. ఆమె తన శిరస్సునుఎత్తి దివ్యకాంతిధామములను దర్శించాలి. తన ధర్మమునకున్న సంపూర్ణ పరమార్థమునూ విస్తృత స్వరూపమునూ ఆమె అవగాహనచేసుకోటానికి పూనుకోవాలి.”

“భారతీయ సంస్కృతికి పునాదులు” అనే పుస్తకంలో వేదమును గురించి ఇల్లా అన్నారు :

“వేదం విశ్వంలో ప్రథమ పవిత్రగ్రంథంగా విరాజిల్లుతున్నది. మానవుని గురించీ ఈశ్వరుని గురించీ విశ్వమును గురించీ వివరించటానికి జరిగిన మొట్టమొదటి ప్రయత్నం వేదం. అంతేకాక మొట్టమొదటి ఉదాత్తశక్తి సమన్వితమైన కవితాసృష్టిగా కూడా వేదమును భావించవచ్చును. శబ్దప్రయోగమూ రచనాస్వరూపమూ పరికిస్తే అది అనాగరికుల వ్రాతకాదని తేలుతుంది. వేదాలను రచించిన కవుల శిల్పకౌశలం అనల్పం. వారి ఛందస్సులు దేవతలకు స్యందనములు. విస్తారమైన దివ్యపక్షాంచలమీద అవి తేలుతూవుంటాయి. సూత్రప్రాయంగనూ తరంగమాలలుగానూ తూగుతూవుంటాయి. గంభీరగమనంతో సూక్ష్మమైన స్వరభేదాలతో అలరారుతూ భావకవితల తీవ్రతనూ మహాకావ్యాల ఉదాత్తగుణమునూ ప్రదర్శిస్తూవుంటాయి. స్వచ్ఛంగా, స్పష్టంగా, మహనీయంగా వినవచ్చే శక్తిమంతమైన వాగ్విలాసం అది. సూటిగా క్లుప్తంగా వుంటాయి. భావంతో అర్థస్ఫురణతో నిండి తొణుకుతూ వుంటాయి. ప్రతి పంక్తి తనకు తాను స్వతంత్ర ప్రతిపత్తిని నిలుపుకుంటూ పూర్వాపర సమన్వయంతో భాసిస్తూవుంటుంది. పవిత్ర సంప్రదాయమును విధేయులై అనుసరించటంవల్ల వాటికి సారమూ స్వరూపమూ ఏర్పడినవి. కాని మానవాత్మపొందిన అత్యంత గంభీరమైన ఆధ్యాత్మిక మానసికానుభూతులు వీటి వస్తువు. కాబట్టి వీటిలో కొత్తదనం లోపించదు. మూసలో పోసినట్లు ఒకేలాగా వుండవు. కవి తను లోపల అనుభవించి జీవించిన సత్యమునే ప్రతిపాదిస్తాడు. వ్యక్తిగతమైన అనుభూతివల్ల, ప్రకటనవల్ల ఈ అనుభూతులు ఒకప్పుడు సూక్ష్మం

గానూ, సమున్నతంగానూ నిత్యనూతన శోభతో అలరారుతూ వుంటాయి. విశ్వామిత్ర, వామదేవ, దీర్ఘతమస ప్రభృతిమహాద్రష్టల వాక్కులు అసాధారణమైన కవితాశిఖరాలను ఆరోహిస్తూ సముదాత్త భక్తికావ్యాల వైశాల్యమును కూడా ప్రదర్శిస్తున్నాయి. సృష్టిక్రమమును వర్ణించే పంక్తులు ఉన్నతభావనాశృంగాలమీద స్వచ్ఛంగా విహరిస్తున్నాయి ఇటువంటి భాగాలు చాలా వున్నాయి ఉపనిషత్కవులు ఇటువంటి సమున్నత భావవీధుల్లో నిరంతరం జీవించారు. తమ తత్త్వమునకూ, ధర్మమునకూ, సంస్కృతిలోని ముఖ్యాంశములకూ ద్రష్టలైన వేదకవుల వాక్కులే మూలాధారములని ప్రాచీన భారతీయులు తలపోయటంలో పొరబాటు లేదు. భవిష్యత్తులో వికాసంపొందిన భారతీయ తత్వసంపద అంతా వేదాలలో బీజరూపంలో ఒదిగివున్నది. తొలిసారిగా అవి వేదాలలో ప్రకటన పొందినవి."

"వేదమును గురించి" అనే పుస్తకంలో వేదాలలో ఇప్పటికీ వెల్లడికాని రహస్యమున్నదా అన్న ప్రశ్నతో మొదలుపెట్టి వేదస్వరూప వివరణచేసి ఎన్నో సూక్తములను వ్యాఖ్యానించాడు.

అనేకులదృష్టిలో హిందూధర్మ గ్రంథాలలో అతి ముఖ్యమైనది భగవద్గీత. దీనినిగురించి రాసిన గీతావ్యాసాలు అరవిందుని రచనల్లో ప్రముఖంగా పలువురు భావిస్తున్నారు.

"మహాభారత కథలో అంతర్భాగంగా భగవద్గీత వెలసిననాటినుంచీ నేటి వరకూ కొత్తదనం కోలుపోకుండా నిలిచింది. నిత్యానుభవంలో ఎప్పటికప్పుడు నూతనంగా భాసించే వస్తువును అందిస్తున్నది. భారతదేశంలో ఇప్పటికీ మత సంబంధమైన ఆలోచనలను శాసించే సిద్ధాంతాల సమాహారంగా భగవద్గీతను ఆదరిస్తున్నారు. అన్ని శాఖలవారూ పూర్తిగా ఆమోదించకపోయినప్పటికీ గీతాబోధను అత్యున్నతప్రమాణంగా అంగీకరిస్తున్నారు. గీతాప్రభావం తత్వవిద్యారంగాలకు పరిమితం కాదు. దాని ప్రభావం ప్రత్యక్షపూర్వకమైనది, సజీవమైనది. ఆలోచనలకూ కార్యకలాపాలకూ ప్రచోదనం కలిగించగలదు. జాతినీ సంస్కృతినీ పునరుద్ధరించి పునర్నిర్మాణంచేసే ఉద్యమం గీతాప్రబోధంనుంచి చాలా ప్రోత్సాహం పొందింది."

భగవద్గీతనుంచి మనం దేనిని కోరుతున్నాము? మనకు కావలసినదేమిటి? దివ్యబోధకుడెవరు? నరరూపంలోవున్న శిష్యుడెవరు? భగవద్గీత బోధలో సారాంశమేమిటి? గీతలోని పరమరహస్యమేమిటి? ఇటువంటి ప్రశ్నలకు గీతావ్యాసములలో సమాధానం చెప్పారు.

# తొమ్మిదో ప్రకరణము

ఆసియా ఐరోపాఖండాలసంపూర్ణ సమగ్ర సమన్వయంగా అరవిందుడు అరుదెంచినాడు. మహాత్ముల కోవలో కగపటి వాడు. తన హస్తముతో పట్టు సడలనీయకుండా సృజనాత్మక శక్తి అనే ధనువును ధరించినవాడు.

రోమా రోలాం.

## దివ్యజీవన సందేశం

మన జీవితానికి గూఢమైన అర్థమేదైనా వున్నదా? చేరవలసిన గమ్యమొకటి వున్నదా? మరణమే అనివార్యమైన చరమావధి అయితే జీవితంలో ఇన్ని సమస్యలనూ కష్టాలనూ ఎదుర్కొని రోసిపోయినందువల్ల ఫలితమేమున్నది? భగవంతుడు సత్స్వరూపుడైతే, సృష్టికర్త అయితే ఆయనచేసిన సృష్టి ఇంత లోపభూయిష్ఠంగా ఎందుకున్నది?

విశ్వకళాపరిషత్తుల్లో నేర్చుకునే చదువులో ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకవు. సంపదలూ అధికారమూ పొందినప్పటికీ దారిద్ర్యం అనుభవించినప్పటికీ త్యాగంచేసినప్పటికీ ఈ ప్రశ్నలకు జవాబులు దొరకవు. కాని ఈ ప్రశ్నలు ఎప్పటికప్పుడు తలెత్తుతూ వుంటాయి.

అనేక సందర్భాలలో ఈ లోకం మిథ్య అనటం విన్నాము. నిజానికి మనకి నేడు కనబడే ప్రపంచంలో చాలాభాగం మిథ్య కావచ్చు. సత్యానికి దూరంకావచ్చు. కాని సత్యం గ్రహించటంకోసం ఈ లోకాన్ని విసర్జించవలసివస్తే మరి ఈ లోకాన్ని ఈశ్వరుడు ఎందుకు సృష్టిచేశాడు? యుగయుగంలో మహాత్ములు ఉద్భవించి వెలుగు ప్రసరించటం దేనికి? ఈ లోకంలో తను ఒక భాగమైనప్పుడు ఈ లోకాన్ని విడిచి దూరంగా మానవుడు పోగలడా? ఈ లోకంలోనే మనిషి జన్మించాడుకదా!

చాలాకాలంకిందట యక్షరూపంలో నిలిచిన ధర్మదేవత లోకంలో అన్నిటికంటే గొప్ప వింత ఏమిటని యుధిష్ఠిరుని ప్రశ్నించింది. అనుదినమూ ఎందరో

మరణిస్తున్నారు. కాని మానవులు తమకు చావులేదన్నట్లు ప్రవర్తించటమే గొప్ప వింత అని ధర్మరాజు జవాబు చెప్పాడు.

ధర్మరాజు గతించి వేలసంవత్సరాలు గడిచినప్పటికీ మనుషులు అదేమాదిరిగా ప్రవర్తిస్తూవుండటమే ఆశ్చర్యకరం. దీనివిబట్టి నరులచైతన్యపు పొరలలో మృత్యువును జయించగల భవితవ్యంపట్ల విశ్వాసం ఎక్కడో నాటుకుని వున్నదనిపిస్తుంది. ఆ విశ్వాసమే వికృతరూపం ధరించి బతుకుమీది గుడ్డిప్రేమగా వెల్లడి అవుతుంది.

ప్రపంచంలో దుఃఖం అపారం. కాని మనిషి లోకాన్ని విడవకుండా ప్రతి కల్పాంతంలో ప్రళయానంతరం పునఃసృష్టి చేస్తున్నాడు. ఈ నిర్మాణాత్మక విజయ శక్తి ఎక్కడిది? సుఖమయజీవితం గడిపి ప్రశాంతంగా మరణించటమే మానవుని ఆశయాలపరాకాష్ఠ కాగలదా?

మనలో ఏదో శక్తి క్షీణస్వరంతో చెబుతున్నది. కనబడే ఈ ప్రపంచమే చరమాంకం కాదు. సాంఘిక రాజకీయసమస్యలూ శారీరకవ్యాధులూ లేని సుఖమయ జీవితమే మానవులు అందుకోగోరుతున్న చిటారుకొమ్మ కాదు.

దివ్యజీవనమనే గద్యమహాకావ్యంలో శ్రీ అరవిందులు మానవచైతన్య స్వభావ పరిణామాలను క్షుణ్ణంగా పరిశీలించారు. పరతత్వస్వభావమునూ వస్తుప్రాణ మనోమయ ప్రపంచపు త్రిపుటితో దానికున్న సంబంధమునూ చర్చించారు. పరతత్త్వమునూ ప్రపంచమునూ అనుసంధించే అతి మానసతత్త్వమును ఏవిధంగా గ్రహించవలెనో విశదీకరించారు. మానవునికి సంబంధించిన ప్రధాన సమస్యను దేనినీ తడవకుండా విడవలేదు.

మన ప్రపంచమూ, ఈ ప్రపంచంలో మన జీవితమూ ఒక విభిన్నమైన భవితవ్యంలో ప్రవేశించగలవు. పృథ్వీమీదసాగే మన జీవితం రూపాంతరం పొందుతుంది. ఆ దశచేరువ అవుతున్నది.

"ఈ లోకం అవిద్యామయం కాబట్టి దీనికి ఆవలవున్న స్వర్గమును చేరుకుంటేనే అటువంటి పరివర్తన కలుగుతుందని వాదించటం సమంజసంకాదు. అటువంటి పరివర్తన అసలే జరగదనీ, మనస్సులోని కోరికకూడా అజ్ఞానపూరితమనీ అనటం సబబు కాదు. జీవాత్మ పరమాత్మలో కలిసిపోయి కైవల్యం పొందాలనే ఆకాంక్షలో తక్కినవన్నీ చేరిపోవాలనటం సమంజసం కాదు. ఈ అపరాప్రకృతి పూర్తిగా అవిద్యామయమైతే, మనలను కుంగదీస్తున్న అజ్ఞానమును అధిగమించ

గల శక్తి ప్రకృతిలో లేకపోతే పైనచేసినవాదం వాస్తవం కాగలదు. కాని అవిద్య కూడా ప్రకృతిస్వరూపంలో భాగమే. అదే సమస్తమూ కాదు. ఆదిశక్తి కాదు సృష్టి కారకుడు కాదు. తనచుట్టూ కొన్ని హద్దులు ఏర్పరుచుకున్న జ్ఞానం దాని ఉత్తమ స్వరూపం. మధ్యమస్వరూపంలో అది దళితచైతన్యం. ఈ రూపంతోనే భౌతికమైన అజ్ఞానంనుంచి ఆవిర్భవిస్తుంది. మనుగడకు పునాది అనదగిన జ్ఞానము దాని నిజ స్వభావము.తన అసలు రూపం పొంది జ్ఞానమును ఆవిష్కరించుటకే చైతన్యం పెనగు లాడుతున్నది. విశ్వసత్తాలోపల మన బుద్ధికి అందవిశ్రేణులు చాలా వున్నాయి. ఈ శ్రేణులను అందుకోగలిగినప్పుడే విశ్వమయసత్యముల అవగాహన ఏర్పడు తుంది. కావలసిన ఉపకరణలు దొరుకుతాయి అసాధారణ పరిస్థితులలో అటువంటి అతీత సత్యబోధ కలుగుతున్నది. ఆధ్యాత్మికమైన వర్తమానాలు అక్కడినుంచి అందుతున్నాయి. ఆధ్యాత్మిక శక్తిమయ తేజోలహరి ప్రసరిస్తున్నది. తమకు అవల వున్న వెలుగు ఎటువంటిదో ఈ శ్రేణులకు తెలుసు. వీటిలో అత్యున్నతశ్రేణికి అతి మానవతత్వంతో ప్రత్యక్షసంబంధం వుంటుంది. ఋతచిన్మయతత్వమును గుర్తి స్తుంది. అంతేకాదు. పరివర్తన చెందే చైతన్యంలోనే ఈ మహత్తరశక్తులు నిక్షిప్తంగా వున్నాయి. మనోమయ సత్యమునకు ఊతగా నిలుస్తున్నాయి. ఈ చైతన్యపు కార్యకలాపాలలో ఆశక్తులు మరుగుపడుతున్నాయి. ఈ అతిమానస తత్వమూ, ఆశక్తులూ సత్యస్ఫురణతో ప్రకృతికి చాటుగావుండి దానిని నిలబెడు తున్నాయి. మానసిక సత్యంకూడా వాటి ఆభాసమే. వాటి అసమగ్రమైన ప్రతి బింబమే. కాబట్టి పదార్థంలో మానసికశక్తులు వికసించినట్లుగానే మనస్సులో అతి మానసికశక్తులు ఆవిర్భవించటం కూడా సహజపరిణామమే."

తెలిసికాని తెలియకకాని మానవుడు మహత్తర జీవనప్రాప్తికోసం ఆకాంక్షి స్తున్నాడనేది నిర్వివాదాంశం. ఇంకా ఇల్లా అంటున్నారు :

"పదార్థజగత్తులో మనం పుట్టటానికి ఒక గూఢమైన లక్ష్యమున్నది. ఈ భూమిపైన పరమార్థం వికసించటమే ఆ లక్ష్యం. ప్రకృతిలో చైతన్యపరిణామం జరుగుతున్నది కాబట్టి మానవుడు ఆ పరిణామంలో చివరి వస్తువు కాదు. పరతత్వం మనిషిలో సమగ్రప్రకటన పొందజాలదు. మానవుడు అసమగ్రమైన పరికరం మాత్రమే. చైతన్యపరిణామంలో బుద్ధికూడా మధ్యమదశగానే వుంటుంది. బుద్ధిగత మైన శక్తికూడా శాశ్వతమైనది కాదు. బుద్ధిగతప్రవృత్తిని మానవుడు అధిగమించ లేకపోతే అతీతమానసమూ అతీతమానవుడూ ఆవిర్భవించి సృష్టిని ముందుకు

నడిపించవలసి వస్తుంది. బుద్ధిని అధిగమించే సామర్థ్యం అలవరుచుకుంటే మానవుడే బుతచిత్‌విభూతిని అతీత మానవత్వమునూ సాధించగలడనటంలో సందేహంలేదు. ప్రకృతిలో పరతత్వం విలసిల్లే పరిణామంలో బుద్ధినీ, ప్రాణమునూ, దేహమునూ, పాల్గొనేటట్లుచేసి సార్థకత్వం పొందగలడు."

ఈ పరివర్తన కొనసాగుతునే వున్నది. మానవుడు తన జీవితంలోని అన్ని రంగాలలో ఎదుర్కొంటున్న సంకటస్థితి ఎంత తీవ్రమైనదో క్లిష్టమైనదో ఈవిధంగా విశదపరుస్తున్నారు అరవిందులు.

"మానవజాతి ప్రస్తుతం తన పరిణామంలో సంకటస్థితిలో పడింది తన భవితవ్యమును నిర్ణయించుకోవలసిన ఘట్టం వచ్చింది. కొన్ని రంగాలలో మానవుని మేధాశక్తి గొప్ప పురోగతిని సాధించింది. కాని కొన్ని అంశాలలో పెరుగుదల కుంటుపడింది, ఎటుపోవాలో తెలియక నిలబడిపోయింది. మానవుని క్రియాశక్తి ఇచ్ఛాశక్తి ఒక బాహ్యనిర్మాణం తయారుచేశాయి. దాని భారం దుర్భరంగా దాని స్వరూపం జటిలంగా వున్నాయి. తన మానసిక భౌతిక జీవితావసరాలకు అనుగుణంగా ఒక జటిలమైన రాజకీయ, సాంఘిక, ఆర్థిక సాంస్కృతిక యంత్రాంగాన్ని ఏర్పరుచుకున్నాడు. ఈ పరిపాలనా వ్యవస్థద్వారా సామూహికంగా బుద్ధిగతమైన, ఇంద్రియపరమైన, భౌతికమైన, రసాత్మకమైన సంతృప్తిని సాధించ గోరుకున్నాడు.

మానవుడు ఏర్పరుచుకున్న నాగరికతావ్యవస్థ అతని పరిమితమైన బుద్ధి గత శక్తికీ అవగాహనకూ మించిపోయిన బరువుగా తయారయింది అంతకంటే పరిమితమైనవి అతని ఆధ్యాత్మిక నైతికశక్తులు. కాబట్టి ఆ వ్యవస్థను అవి నడిపించి వినియోగించుకోలేకపోతున్నాయి. తప్పటడుగులువేసే అతని అహంభావానికీ కోరికలకూ నాగరికతావ్యవస్థ ఒక సేవకుడుగా పనిచేస్తున్నది. మానవచైతన్యపు ఉపరి భాగానికి ఇంతవరకూ దర్శనశక్తిగల బుద్ధీ, బోధిశక్తిగల జ్ఞానమూ రాలేదు. సంపూర్ణజీవన ప్రాతిపదిక వికాసమే అతీత జీవనవికసనమునకు అవశ్యమని గ్రహించే దశ రాలేదు. ఈవిధమైన సంపూర్ణజీవన సమున్మేషంవల్ల మానవుడు భౌతికమైన ఆర్థికమైన అవసరాలనుంచీ తీరని కోరికలనుంచీ విడుదల పొందవచ్చును. అప్పుడు భౌతికజీవితానికి అతీతమైన ప్రయోజనాలను సాధించటానికి పూర్తిగా ప్రయత్నించవచ్చును. అతీతమైన సత్యశివ సౌందర్యములను కనుగొనవచ్చును. ఉత్తమ జీవనసాధనకోసం జీవితమును పరికరంగా ఉపయోగించే మహత్తర దివ్య

శక్తిని కనుగొనవచ్చును. కాని అటువంటి అవకాశం నేడు దుర్వినియోగమవుతున్నది. క్రొత్త కోరికలు వెర్రితలలు వేస్తున్నవి. సామూహికచైతన్యం ప్రబలంగా విస్తరిస్తున్నది. నేడు శాస్త్రీయవిజ్ఞానం విశ్వశక్తినుంచివచ్చే ప్రబలమైన అంశలెన్నిటినో వినియోగిస్తూ భౌతికసమైక్యమును సాధించగలుగుతున్నది. కాని ఈ విశ్వశక్తిని దుర్బలమానవుడో సమిష్టిబలమో నడుపుతున్నది. నడిపేశక్తులకు విశ్వజనీనమైన వివేకం లేదు. భౌతికంగా సమూహస్వరూపం ఏర్పరుచుకున్న సమిష్టిబలానికి మానసికమైన పారమార్థికమైన సమైక్యమును సమకూర్చగల అంతశ్శక్తి నేడు కొరవడుతున్నది. ఇప్పుడున్నదేమిటంటే విభిన్నభావాల సంఘర్షణం. వ్యక్తిగతమైన సమూహపరమైన భౌతికవాంఛలూ, అవసరాలూ, తీవ్రమైన కోరికలూ, అజ్ఞానపూరితమైన ప్రాణశక్తి కోరికలూ, జీవన పరితృప్తికోసం వ్యక్తులూ వర్గాలూ జాతులూ వేస్తున్న ఆకలికేకలూ, రక్కసపొదలవంటి సాంఘిక రాజకీయ ఆర్థిక తంత్రములూ కనబడుతున్నాయి, తామరతంపరలుగా వెలువడుతున్నాయి వినాదాలూ పరిష్కారాలూ. వీటికోసం దళనం చేయటానికి దళితులు కావటానికీ, హత్యలు జరపటానికీ హతులుకావటానికీ మానవులు సిద్ధపడుతున్నారు. తన అధీనంలోవున్న ప్రబలమైన పరికరాలసాయంతో వీటిని ఇతరులమీద బలవంతంగా విధించటానికి వెనుదీయటంలేదు. ఆదర్శస్థితిని చేరుకోవాలంటే ఇదొక్కటేమార్గమనే విశ్వాసంతో ఇవన్నీ చెలాయిస్తున్నారు. మానవజీవితమూ మేధాశక్తీ విశ్వజనీనంగా పరిణమించాలి. అహంభావంతోనూ, ముక్కలుగా విడిగొట్టే దృష్టితోనూ విశ్వజనీనతను పొందగలిగినప్పటికీ అస్తవ్యస్తమైన ఆలోచనలతో, కోరికలతో, ప్రబలవాంఛలూ శక్తులూ ఎగసిపడే వెల్లువతో అది కళంకితమవుతుంది. సమన్వయసూత్రం లోపించినందువల్ల కలగాపులగమైన మానసికభౌతిక ప్రాణశక్తుల వికృతప్రదర్శనం మిగులుతుంది. అంతటా అపశ్రుతీ, అపసవ్యధోరణీ, అస్తవ్యస్తమూ తారసిల్లుతవి. అటువంటి గందరగోళంనుంచి సమన్వయ సంగీతవిలసిత భవ్యజీవనం రూపొందించటం అసాధ్యం.”

అనాదికాలంనుంచీ మానవులలో సాగుతున్న బహుముఖ ఆధ్యాత్మిక అన్వేషణను కూలంకషంగా అరవిందులు పరిశీలించారు. ఆ అన్వేషణకు పరమావధి ఏమిటో, ఆ పరిణామం ఏవిధంగా అనివార్యమో సూచించారు. పదార్థజగత్తులో దివ్యత్వం స్వయంప్రకటన పొందగలదని భవితవ్యసూచన చేశారు. అడుగడుగునా జ్యోతిప్రకాశం కావటమే ఈ పరిణామస్వభావం.

"బుద్ధికీ అతిమానసానికీ నడుమ వంతెన కట్టాలి. పూడిపోయిన దారులు సరిచేయాలి. ఉత్తరాయణానికీ అవతరణానికీ మార్గాలు ఏర్పరచాలి. ఇప్పుడూ శూన్యంగా మౌనంగావున్న సీమల్లో ఈ నిర్మాణం సాగాలి. త్రివిధమైన పరివర్తన ద్వారానే ఇది సిద్ధించగలదు. మొదట చిత్తపరిణామం రావాలి. మన సమస్తప్రకృతీ ఆత్మకు పరికరంగా తయారుకావాలి. దీనితోపాటు ఆధ్యాత్మిక పరివర్తన జరగాలి. ఉన్నత సీమలనుంచి కాంతి, జ్ఞానము, బలము, శక్తి, ఆనందము, స్వచ్ఛత మన లోకి దిగిరావాలి. మన శరీరంలో ప్రాణంలో మారుమూలలదాకా, సుప్తచైతన్యపు చీకటివరకూ, మనుగడ విలువెల్లా వాటిప్రభావం భాసమానం కావాలి. కడపటికి అతి మానసికపరివర్తనం రావాలి, శుభముహూర్తం ఆసన్నమైనప్పుడు పరిణామ పరాకాష్ఠగా ఋతచిత్‌వైభవాన్ని పొందటానికి బుద్ధి ఉత్తరాయణం పొందాలి అదే సమయాన ఋతచిద్వైభవం మన సమస్త ప్రాణమునూ ప్రకృతి సర్వమునూ దీప్తిమంతం చెయ్యాలి.

# పదో ప్రకరణము

కవితలో వాడే శబ్దాలకు మనలను ఆలోచింపజేసే శక్తి భావింపజేసే శక్తీ వుంటాయి. వాటికంటే ముఖ్యమైన గుణం మనకు దృష్టిని ప్రసాదించటం. ఆ దృష్టివలనకాని ఆ దృష్టినుంచికాని మన భావాలూ ఆలోచనలూ బయలు దేరగలవు. అప్పుడు అది పశ్యంతీ వాక్కు అవుతుంది. ఇదే కవి ప్రయోగించే శబ్దానికి ప్రధాన లక్షణం, ప్రముఖ శక్తి.

శ్రీ అరవిందులు . భావి కవిత

## కవిత్వమూ - భవిష్యత్తులో సౌందర్య మీమాంస.

శ్రీ అరవిందులు కవితను దర్శించిన విధానంలోనూ రసమీమాంసలోనూ విశిష్టత కనబడుతుంది. పరిణామశీలిగా మానవుని భావించటమే ఈ ప్రత్యేకతకు మూలకారణం. మునుపు అందుకోని శక్తులను మనిషి భవిష్యత్తులో ఈ పరిణామం ద్వారా సాధించగలడనే విశ్వాసంవల్ల ఆయన సౌందర్యమీమాంస విశిష్టతను సంత రించుకుంటున్నది.

“మానవుడు ఒక సన్నటి వంతెన,
ఈశ్వరుని సురుచిర కుసుమానికి కోరకదశ మానవుడు”

—మౌన విశ్చేతనం

“ఓ దైవమా! నాకు తెలుసు.
మట్టిలో ఆటలాడుతున్న ఈ మానవుడు సూర్యునీ నక్షత్రాలనూ కూడా కైవసం చేసుకుని పురాతనమైన ఈ స్వరూపాలకూ నియమావళులకూ, విధానాలకూ నూతన రూపకల్పనచేసే శుభదినం వచ్చితీరుతుంది”

మాండవ్యుని ఊహలు,

"పరిణామం" అనే కృతిలో మానవభవితవ్యాన్ని గురించి ఇల్లా అన్నారు :

"మానవుని సంకల్పమూ, పాటవమూ నేటికీ సాధించని శక్తి
అనంతత్వములో ఆరూఢమైన జ్ఞానం,
మన పెనగులాటలకూ వేదనలకూ అతీతమైన ఆనందం
భూమిమీద బందీగాపడివున్న మానవుడు
భవిష్యత్తులో అందుకోగలడు.

కాబట్టి మానవుడు పరిణామగమనంలో ఒక మజిలీ అన్నమాట. మెల్లిగా పారాడు తుంటూ ప్రస్తుతస్థితిని చేరుకున్నాడు. ఇప్పుడు ఒక సంకటపరిస్థితిలో చిక్కుకుని వున్నాడు ఇందులోనుంచి బైటపడి తనకోసం నిరీక్షిస్తున్న మహత్తర భవితవ్య మును సమాశ్లేషంచేసుకునే తరుణం ఆసన్నమైనది. అరవిందులు చెప్పినట్లు ఒక అనంత పరిపూర్ణశక్తి మానవునికి తన లక్షణాలను ప్రసాదిస్తూ మనిషిని మలచుకుం టున్నది. యుగయుగాలనుంచీ తన అసలు స్వరూపమైన పరిపూర్ణతను ప్రకటన చేసుకోవాలనే గూఢమైన ఆకాంక్ష మానవులలో వున్నది. ఇది మన ఆత్మోన్నతికి కారణమౌతుంది. ఒకప్పుడు మన లలితకళా కలాపాలలో ఈ ఆకాంక్ష వ్యక్త మౌతుంది. "ఉత్తమకళ ఆత్మద్వారాలను తెరుస్తుంది. ఉత్తేజితమైన విషయబోధక మైన రూపాలను వినియోగిస్తుంది" అంటారు అరవిందులు. మనలోవున్న రసచేతన ద్వారా ఈ కార్యకలాపాల సార్థకత్వం గుర్తించగలుగుతున్నాము. ఈ రసాస్వాదన కొంతవరకూ పుట్టుకతోవస్తుంది. కొంతవరకూ అభ్యాసంవల్ల వృద్ధిపొందుతూ మన లోపలా వెలుపలా విరిసిన అందాన్ని గుర్తించగలుగుతున్నది. "ఉత్తమ సౌందర్య దర్శనమే దైవసందర్శనం" ఆధ్యాత్మికదృష్టితో చూస్తే ఆ పరిపూర్ణతకు ఇంకో పేరు దైవం. తెలిసికాని తెలియకకాని ఆ పరిపూర్ణతా సంసిద్ధికోసమే మన ఎడతెగని ఆరాటం.

సాధారణంగా మానవుల సౌందర్యానురక్తి బుద్ధికి సంబంధించివుంటుంది. ఒక్కొక్కప్పుడు కళ కళకోసమే అనే సంకుచిత రసతత్వంగా పరిమితమైపోవచ్చు మనస్సుకూ బుద్ధికీ అతీతమైనస్థాయినుంచి సౌందర్యమీమాంస సాగించటం సాధ్య మౌతుంది. దీనినే అరవిందులు ఉన్నత మానసస్థితి అంటారు. ఈ స్థితిలో రసా స్వాదన నియమాలకూ సూత్రాలకూ కట్టుబడదు. సంకుచితమూ ప్రత్యేకమూ అయిన ప్రతిదానినీ పరివర్తనకు గురిచేసే శాశ్వత విశ్వజనీన సౌందర్యమును గుర్తించగల స్థాయిని చేరుకుంటాడు. తన సుఖదుఃఖాలద్వారా ప్రతివ్యక్తి పరిణామం పొందు

తున్నాడు. వివానంగానో త్వరితంగానో ఇది సాగుతున్నది. కాబట్టి మానవుడి రస చేతనకూడా తీవ్రానుభూతులను పొందుతూ భౌతిక నైతిక మానసిక సౌందర్యాలను దాటిపోయి అక్షయమైన ఆధ్యాత్మిక సౌందర్యానుభూతిని అందుకోవచ్చు. తమ సావిత్రి కావ్యాన్నిగురించి రాసిన ఒక లేఖలో శ్రీ అరవిందులు అది ఉన్నత మనో భూమికనుంచి ప్రేరణపొందిన రచన అన్నారు. ఆ కావ్యాన్ని ఆస్వాదించటానికి అవసరమైన లక్షణాలనుగురించి ఈవిధంగా రాశారు.

"ఒక ప్రాతిపదిక విశ్వజనీన రసచేతన అవసరం. ఉపరితలం వెనకవున్న దాన్ని గ్రహించగల సహృదయత, ఉత్తేజిత దర్శనశ్రవణ భావనాశక్తులూ కావాలి. అతీతసత్యమును అనుభవించగల మహత్తర విశాలతర గాఢతర రసచేతనఅవసరం. పార్థివమైన మానసికమైన ఇంద్రియగతమైన ప్రపంచంలో ప్రవేశించే అతీత పార మార్థికతత్వమును గ్రహించగలగాలి."

ప్రపంచమును అరవిందులు దర్శించేవిధానం భిన్నమైనది. కాబట్టి అరవిందుని రసచేతన అసాధారణంగా మనం మామూలుగా అనుకునేదానికి భిన్నంగా వుండ టానికి ఇది రెండోకారణం.

"లోహమయ, జంతుతత్వసమన్విత, మహావిస్తృత, విస్పహాయప్రపంచం ఒక ఆటబొమ్మ.

గిరగిర తిరుగుతూ, శోకిస్తూ, రక్తం చిందిస్తూ, శిథిలమైకూడా ఆగలేక లోహచక్రంలో పడిన లోకం"

మాండవ్యుని ఊహలు.

అయినప్పటికీ

"మహాశక్తి సంపన్నములైన ఆత్మలు వరించినస్థానం భూమి,
వీరోచిత ఆత్మలకు సంగ్రామరంగం ఈ భూమి,
విశ్వశిల్పి తన కృతులకు ఆకృతి అమర్చే కర్మశాల ఈ భూమి"

—సావిత్రి.

కాబట్టి మానవులమైన మనకూ భగవంతునికీ ఒక అనుబంధం వున్నది.

"దైవమూ మానవుడూ పరస్పర ఋణగ్రస్తులు.
ఆయన స్వభావాన్ని మనమూ మన స్వభావాన్ని ఆయనా స్వీకరించిధరించాలి.

ఈశ్వర సంతానమైనా ఈశ్వరునిలా మనగలగాలి.
మానవస్వభావం దివ్యత్వంగా పరిణమించాలి.
పరస్పరవిరుద్ధంగా తోచే మానవజీవితానికి ఈశ్వరుడే మూలసూత్రం."

కాబట్టి ఈ భౌతికప్రపంచం భగవంతునికి విరుద్ధమైనదికాదు. లోకంలో ప్రతివస్తువూ దాని బాహ్యస్వరూపం ఏమైనప్పటికీ గాఢమైన ఉదాత్తమైన తత్వమునకు ప్రతీకంగా వుంటున్నది.

కాలపథంలో మానవజాతి ప్రయాణంచేసి చాలా క్లిష్టమైన ఘట్టమును చేరుకున్నది. ఈనాడు ప్రపంచంలో జరిగే ప్రతిసంఘటనా విస్మయజనకంగా వుంటున్నది. ఈ స్థితి మానవుల కళాకలాపాలలోకూడా కనిపిస్తున్నది. "భవిష్యత్కవిత" అనే గ్రంథంలో అరవిందులు ఈ పరిస్థితినిగురించి ఇల్లా హెచ్చరించారు.

"ప్రస్తుతం మానవుని మనస్సు రెండురాజ్యాల పొలిమేరలను దాటటానికి చూస్తున్నది. క్రియాశీలమైన భౌతికమైన బుద్ధివాదపు సీమలు దాటుతున్నది. బుద్ధి ద్వారా సత్యాన్వేషణచేస్తూ పోగాపోగా అపరిచితసీమల్లో అడుగుపెట్టటం, బోధిద్వారా సత్యాన్వేషణ జరపటం సంభవించింది. కాబట్టి దారి తెలియక అన్నివైపుల చూడటం, దేవులాడటం జరుగుతోంది. ఈ అనిశ్చిత స్థితి తాత్కాలికమైతే ఫరవా లేదు. కాకపోతే ఇది ఉజ్వలంగా పొడగట్టే కళంకమునకూ, పతనమునకూ దారి తీయవచ్చును."

ఉజ్వలంగా మురిపించే అవసాద లక్షణాలు ఆధునిక కవితలో చాలా కనిపిస్తున్నాయి. కవులు సముజ్వల మనస్కులు కావచ్చు. కాని అంతటితో సరిపోదు. నేటి కవిత్వపై బరులనూ, నిన్నటి కవిత్వధోరణులనూ, రేపటి కవిత్వం మార్పు లేకుండా కొనసాగిస్తూ పోరాదు. వెనకటి ధోరణులకు తిరోగమించటం కూడా జరగవచ్చు. గతకాలపు పోకడలను కొనసాగించినప్పుడుకూడా గణనీయమైన విజయాలు సాధించాలంటే ఆధునిక కవిత తన పరిధిని పెంచుకోవాలి విశ్వంతో విపులమైన పరిచయం ఏర్పడిన తరవాతకూడా ఈ లోకంలో పరాయివాడినని భావిస్తూ ఎవరో నిర్మించిన ఈ వ్యవస్థను చూసి బెదిరిపోరాదు. మానవుని భౌతిక దృష్టివికాసానికి తగినంతగా చైతన్యం కూడా విస్తరించాలి. చీకటిలో దేవులాడి చివరికి సవ్యదర్శనం పొంది ఆత్మసీమ ద్వారాలు తెరుచుకోగలగాలి. "తత్త్వవేత్తకు వివేచన, శాస్త్రవేత్తకు ఆలోచనాప్రేరితమైన విశ్లేషణ, కవికి దర్శనమూ ప్రధాన లక్షణాలు."

అటువంటి దర్శనం మంత్రరూపంగా ప్రకటిత మౌతుంది. మామూలు అర్థంలో మంత్రశబ్దాన్ని మతపరమైన సూత్రంగా వినియోగించటం లేదు. "అతి గూఢమైన సత్యమునకు వాణి మంత్రము. ఆ సత్యమును లయాన్విత శబ్దరూపంలో అత్యంత శక్తిమంతంగా ప్రకటిస్తుంది మంత్రం.'' ఆంతరంగిక స్వాతంత్ర్యపు సమున్నతసీమల నుంచి మంత్రం వెలువడుతుంది.

మానవుని గురించీ, ప్రకృతిని గురించీ, జీవితాన్ని గురించీ నూతనమైన, మహత్తరమైన ఆత్మదృష్టి వెలసి భావమూ, జీవనమూ దానిలో నిండి తొణికిస లాడాలి. అదే భవిష్యత్కవితయొక్క సంపూర్ణ స్వరూప లక్షణం. సాహిత్యం విలసిల్లిన మహాయుగాలలో అటువంటి ఆత్మవిస్తరణమూ, మానసికవైశాల్యమూ సృజనశక్తిని ఉద్దీపింపజేశాయి. గత శతాబ్దంలో మానసికమైన, రససంబంధమైన నూతన సిద్ధాంతాలు తలఎత్తినప్పటికీ వాటి ప్రభావం తాత్కాలికంగా ఉపరితలం మీదనే చిన్న అలలనురేపింది. సమగ్రమైన పురోగతి, జీవితదిగంచలాల విస్తరణ, భావక్షేత్రవైశాల్యం, ఆత్మశక్తికి ఉన్నతీ సమకూరినప్పుడే సృజనశక్తికి నిజమైన ప్రేరణ లభిస్తుంది. విపులమైన విశ్వజనీనదృష్టి వ్యక్తులకూ జాతులకూ మహోన్నత భవితవ్యం రానున్నదనే విశ్వాసం, మానవుల సమైక్యమునకూ, ప్రకృతిగమనమునకూ మానవుల మనస్సుకూ అనుబంధమున్నదనే అవగాహన ఈనాడు మానవజాతి చైతన్యంలో క్రమంగా కలుగుతున్న పరిణామంలో గోచరిస్తున్నాయి.

భావ పరివర్తనం మాత్రమే చాలదు ఆధ్యాత్మిక సాంస్కృతిక రంగాలలో కూడా మార్పు రావాలి. కోమలమూ, సూక్ష్మమూ, సంక్లిష్టమూ అయినటువంటి అంతర్దర్శనమూ, అనుభూతీ రావాలి. సమకాలీన కవులు ఇటీవల దీనికి పూర్వ రంగం సిద్ధంచేస్తున్నారు. ఈ గాఢమైన అనుభూతులను ప్రకటించినంతలో సరిపోదు. ఆధ్యాత్మిక భావన జీవితంలో సంపూర్ణంగా, సర్వతోముఖంగా ఆవహిం చాలి. వ్యక్తుల మనస్సులనూ, బుద్ధినీ, కల్పననూ ఆవేశిస్తే చాలదు. దానితో జాతి చైతన్యమంతా నిండి తొణకాలి. భావనావీధు లన్నిటిలోనూ, జీవనపథాలనిండా ఆధ్యాత్మిక చైతన్యవిలాసం వెల్లివిరియాలి. ఆధ్యాత్మికశక్తి జీవితానికి క్రొత్తరూపు రేకలు తీర్చిదిద్దాలి భవిష్యత్కవిత ఈ అధ్యాత్మిక ప్రగతికి దోహదం చేయాలి. నవ్యదర్శన శక్తిగల నయనాలనూ, రమణీయ రస స్వరూపాలనూ, ప్రకటనా సామర్థ్యమున్న రసననూ, మహోన్నత జీవితమునూ జాతికి ప్రసాదించాలి. ఇదే భావికవితకు సారాంశం.

మానవుని లోపలా, వెలుపలి ప్రకృతిలోనూ దివ్యత్వం దర్శించగల విశాల విశ్వమయదృష్టి కావాలి. తనలో ఒదిగిన దివ్యాంశలనూ, తనలో రేకులు విప్పుకో గల దివ్యావకాశములనూ మనిషి గుర్తించాలి. ఆలోచనలలో, ఆవేశములలో, అవగాహనలో, ఆచరణలో ఆధ్యాత్మిక అభ్యున్నతి కలగాలి. చిత్తమూ, హృదయమూ పరిణతి పొందాలి. తన స్వభావమునూ, ప్రపంచతత్వమునూ ఇంకా గాఢంగా అర్థం చేసుకోగలగాలి. తన లోపలి దివ్యాంశలనూ, పారమార్థిక ప్రమాణములనూ మేలుకొలపాలి ఈ జాగృతి మానవజీవిత నిర్మాణమంతటిలోనూ దీపించాలి. మునుపు విదానంగాను ఇప్పుడు ప్రస్ఫుటంగాను విశ్వంలో ఆవిష్కారం పొందుతున్న ఆత్మశక్తి మనకు ఈ భవిష్యత్తునే సూచిస్తున్నది. ఈ ఆత్మవికసనమును తమ జీవితంలోను, సంస్కృతిలోను ఇముడ్చుకొని ప్రకటించగల జాతులలోనే నవ ప్రభాతం తేజరిల్లగలదు. జాతి ఏదైనప్పటికీ ఈ ఆధ్యాత్మిక దర్శనము పొందిన వారూ, దానివల్ల ఉత్తేజితులై గొంతు విప్పేవారూ భవిష్యత్కవితను సృష్టించ గలరు.

# పదకొండో ప్రకరణం

"సావిత్రి : అరవిందుల దర్శనానికి ఉత్తమావిష్కారణం"

మాత

## మానవభవితవ్య సూచక మహాకావ్యం

కాలం గడిచిన కొద్దీ ఈ యుగంలో ఎదురౌతున్న పరస్పర వైరుధ్యాలు ప్రస్ఫుటంగా కనబడగలవు. సమకాలీన జీవితంలో నిర్వేదమూ రక్తపాతమూ సృజనశక్తిని కుంఠితం చేస్తున్న తరుణంలో స్వర్ణశోభామయ ప్రభాతమును భావించగల సమగ్రదర్శనం కూడా వికసిస్తున్నది. వర్తమానపు మాంత్రిక సౌధంలో ఛాయావృత గహన శ్రేణులలో ఆగ్రహ విషాద రోదనలు ప్రతిధ్వనిస్తున్న సమయంలో నవమంగళ ప్రభాతమును ఆహ్వానించే అద్భుత భైరవ రాగాలాపన కూడా వినబడుతున్నది.

సమకాలీన సాహిత్యంలో తీవ్రస్వరంలో ప్రకంపించే నిర్వేదనారావాలు యదార్థాలు కావు అనలేము. అరవిందుల మహాకావ్యంలో ప్రకటితమైన ఆశాపూరిత దర్శనమును కూడా కాదనటానికి వీలులేదు. మానవచైతన్యం చేసిన సాహసయాత్రా కథనం సావిత్రి. అదికూడ విశ్వసనీయమయిన దర్శనమే మరి

ప్రపంచపు వేదనలు భ్రాంతులని అరవిందులు సావిత్రిలో నిరాకరించలేదు.

"దారి తెలియక తికమకలుపెట్టే ఈ లోకం అసంతృప్తికి స్థావరం.
ఇది అజ్ఞానానికి నిలయం, ఇది వేదనా మందిరం
ఇక్కడే కోరికల శిబిరాలు; ఇదే విషాదాల కేంద్రం."

అయినప్పటికీ వీటిని అధిగమించిన సత్యం ఒకటున్నది.

"ఒక జ్యోతి వున్నది, అది ప్రకృతి ద్వారా ప్రాంగణంలో భాసిస్తున్నది. పాంథులకు లోపలిదారి చూపుతున్నది. మన తనువున ప్రతికణములో ఆ జ్యోతి జ్వలించటానికి నిరీక్షిస్తున్నది."

ఈ జ్యోతిని అవగాహనచేసుకోగలగటం మార్మికమైన అనుభూతి కాబట్టి అరవిందులను నిస్సంశయంగా మార్మిక కవి అనవచ్చును. మానవచైతన్యంలో ఒక సీమలో మార్మికానుభూతులుకూడా వాస్తవములే. చెప్పుకోదగిన కవులందరి లోనూ కొంత మర్మవాద లక్షణం వుంటుంది. అందువల్ల కవిత్వానికి ఒక ఆకర్షణ కలగవచ్చు. అంతకుమించి మరేమీ సాధించలేదు అనవచ్చు. కాని శ్రీ అరవిందుల కవిత్వం ఇందుకు భిన్నంగా వుంటుంది. మార్మిక కవి దర్శించిన శిఖరాగ్రాలమీద విరాజిల్లే జ్యోతిర్మయశోభ మానవ జీవిత కేదారాలను పునీతంచేస్తూ ప్రవహిస్తుం దని ఆయన విశ్వాసం. పరిణామశీలియైన మానవుడు ఆ ప్రభావానికి వశమౌతాడు.

"మానవుడు మహనీయుడైనాడు; అపరితృప్తుడైనాడు,
అదృశ్యతత్వ పరిగ్రహణకు సంసిద్ధుడైనాడు,
నిరంతరాన్వేషి; నేర్చుకోవలసింది అపరిమితం;
జీవితపు బాహ్యచేష్టలన్నీ కరతలామలకం
ఇక అంతరంగపు రహస్యసీమలలోనే సాగాలి అన్వేషణం.

సావిత్రి II 4

"అనాదికాలంనుంచీ మానవుడు ప్రబోధం పొందిన పిమ్మట సంశయవాదా లన్నీ దూరంగా తరిమిన తరవాత అనివార్యంగా అన్వేషించే పరతత్వం ఇదే. దివ్యత్వమును అవగాహనచేసుకోటం, పరిపూర్ణత దిశకు పయనించటం, నిర్మల సత్యమునూ, అమలినమైన ఆనందమునూ వెదకటం, అంతరాళంలో అమృతత్వ రహస్యానుభూతి పొందటం ఈ అన్వేషణకు ఫలాలు. మానవ విజ్ఞానపు ప్రభాత సమయంనుంచీ నేటిదాకా ఈ అన్వేషణ నడుస్తూ వుంది. అనాది వాంఛలలోకి దిగ జారిపోనున్న ప్రకృతి బాహ్యస్వరూపాన్ని విజయవంతంగా విశ్లేషణ చేసినంత మాత్రాన మానవులకు తృప్తికలగటంలేదు. జ్ఞానము ప్రప్రథమంగా దైవరూపంలో, కాంతి, స్వేచ్ఛ, అమృతత్వస్ఫూర్తితో ఆవిష్కరణ పొందింది. అదే జ్ఞానమునకు చరమావిష్కారము కూడా అవుతుంది" అన్నారు అరవిందులు తమ మహనీయ గద్యరచన దివ్యజీవనంలో.

మానవుడు తన పరమ గమ్యమును చేరుకోకుండా అవిద్య అడుగడుగునా అడ్డుపడుతుంది. ఇంకొక అవరోధం మృత్యువు. భీరువైన మానవాత్మను బెదిరిస్తూ పెత్తనం చెలాయించే అబద్ధం. అంధకార జనితమైన అసత్యం. సకల జీవరాశికీ అనివార్యమైన చరమదశ. భయపెట్టి ప్రాణికోటిమీద ప్రభుత్వం చేస్తుంది.

భయంకర మృత్యునియంతను ఎదుర్కొ_గల శక్తి ఒకటే వుంది. అదే ప్రేమ.

"మరణాంధ వీథిలో ప్రణయలోచనాలు తారకలై
మిలమిల మెరుస్తాయి.
ప్రణయప్రచోదిత పాదాలు నగ్నవిస్తృత భూములలో
నిర్లక్ష్యంగా సంచరిస్తాయి.

ప్రణయమునకూ, మరణమునకూ శాశ్వత సంఘర్షణ మున్నది. మరణమును జయించగల శక్తి ప్రణయమునకున్నదని చాటే కథ మహాభారతంలో సంక్షిప్తంగా సావిత్రి గాథలో వున్నది. రాజపుత్రిక సావిత్రి అరణ్యంలో భర్త కుటుంబంతో ప్రవాస జీవనం గడుపుతూ వుంటుంది. భర్త మరణాన్ని గురించి ఆమెకు ముందే తెలుసు. మరణం సంభవించే దుర్దినాన భర్తవెంట అడవికి వెళ్ళింది. విధినిర్ణయం ప్రకారం సత్యవాన్ మరణించి నేలకూలిపోతాడు. సావిత్రి అతినిర్మల ప్రేమ పూరితురాలైన పత్ని. అంతేకాక సముజ్జ్వలమైన ఆధ్యాత్మిక శక్తిసంపన్నురాలు. ఆమె అంతర్దర్శనం వల్ల యముడు సత్యవానుని ఆత్మను పాశంలో బిగించే క్షణాన్ని కనుగొనగలిగింది. సడలని సంకల్పంతో ఆమె యమునివెంట నడిచింది తిరిగి వెళ్ళిపొమ్మని యముడు వేడుకున్నాడు. కాని ఆమె వెనుదిరగలేదు. ఆమె ప్రణయశక్తికి ఆశ్చర్యపడ్డాడు. ఎల్లాగైనా ఆమెను మరలించాలని యముడు చాలావరాలు అనుగ్రహించాడు. సత్యవంతునివల్ల నూరుమంది పుత్రులను పొందే వరం ఇమ్మని సావిత్రి ఒక క్లిష్టమైన ముహూర్తంలో కోరి ఆ వరం పొందింది. అది ఎట్లా సంభవం కాగలదు? సావిత్రి తెలివితేటలకు లొంగిపోయిన యముడు సత్యవంతుని పునరుజ్జీవితుని చేయక తప్పని పరిస్థితి ఏర్పడింది.

ఈ గాథను శ్రీ అరవిందులు ఎంతో విపులమైన అర్థస్ఫురణ కలిగించే ప్రతీకంగా పరివర్తింపజేశారు మానవుడు చాలా దుర్బలుడు, క్షుద్రుడు. అతని ప్రేమ మృత్యువును ఎదుర్కొ_టానికి సమర్థమైనది కాదు. అది చాలా వక్రమైనది, ప్రాచీనకాలంలో నడిచిన కథకు నాయిక సావిత్రి. మృత్యువు జయించాలనే ఆమె

సంకల్పం ఒక కాలానికే కాక అన్నికాలాలకూ వర్తించే ఆకాంక్ష. మానవజాతి పక్షాన ఆమె చిరంతన సాధన కొనసాగి దివ్యప్రేమలహరి అవతరిస్తుంది. అవిద్య అనే బహుఫణ భుజంగమును ఎదుర్కొనగల శక్తి ఆ ప్రేమయే.

"మహాకావ్యములోని ఆశ్వాసములను చదువుతూపోయినప్పుడు అశ్వపతితో అంధకారపూరిత అధోలోకాలలోనూ, జ్యోతిర్మయమైన ఊర్ధ్వలోకాలలోనూ సంచరిస్తాము, సావిత్రి వెంట మనోమయ, హృదయమయ ఆత్మమయ అంతర్లోకాలలో సాహసయాత్ర చేస్తాము. శక్తీ, విషాదమూ, తేజస్సూ అనే త్రిపుటి మనకు తారసిల్లుతుంది. ఆత్మసామ్రాజ్య స్వప్నసీమలో సావిత్రికీ, యమునికి జరిగిన సంఘర్షణకు రంగములైన అనంతాంధ నిశీథంలో, ద్విసంధ్యాసమయంలో, శాశ్వతవాసరములో ఆ పెనుగులాటను చూసే ప్రేక్షకులం అవుతాము. అంతా పరిసమాప్తమైన పిదప సావిత్రీ సత్యవానులు రాత్రివేళ విశ్రమించినప్పుడు మహత్తరప్రభాతం రానున్నదనే స్థిరమైన నిశ్చయమూ, ఆశాభావమూ మనలను ఉత్తేజపరుస్తవి." (డాక్టరు కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్).

మహాకావ్యమును శ్రద్ధగా అధ్యయనం చేసిన పాఠకులకు సావిత్రి పాత్ర వర్ణనాతీతమైన ఆవిష్కరణానందమును అందిస్తుంది. ఆమె మానవీయమైన ఆత్మ శోకమాత.

"విశ్వమును తన శోకమయ దేహంగా స్వీకరించి
శోక సప్తక జనని గర్భాన ధరించింది.
నెత్తురుచిందే ఎడదలో ఏడుపోట్లు నాటుకున్నాయి
ఆమె వదనాన విషాదమాధురి
అనాది ఆర్తితో కన్నులు తడిపి మసకవేశాయి,
ఆమె హృదయం విశ్వవేదనతో భగ్నమైనది.

సావిత్రి VII - 4.

అయినప్పటికీ సావిత్రి కాంతికి మాత.

స్వర్గకాంతి ఆమె కన్నులలో భాసించింది.
ఆమె పాదములు జ్యోత్స్నా పాదములు.
ఆమె వదనం రవి బింబం

ఆమె మందహాసం శిధిల విర్జీవహృదయాలను
పునరుజ్జీవింపజేసి ప్రశాంత స్పర్శను ప్రసాదిస్తుంది.

సావిత్రి VII - 4.

సాధారణంగా మహాకావ్యంలో నాయకుని అసమానశౌర్యం వర్ణిస్తారు. విశ్వసాహిత్యంలో వున్న మహాకావ్యాలకు భిన్నంగా ఒక స్త్రీని నాయకురాలుగా స్వీకరించటం అపూర్వం, అద్వితీయం.

విశ్వసాహిత్యంలోని మహా కావ్యాలలో యుద్ధం ప్రధాన వస్తువు. ఈ యుద్ధాలకు గూఢమైన అంతరార్థం వుండవచ్చు. కాని సావిత్రిలో సంఘర్షణ మానవచైతన్యరంగంలో సాగుతుంది. ఈ విషయాన్ని శ్రీ అరవిందులు 'భవిష్యత్కవిత' గ్రంథంలో విశదీకరించారు.

"మానవునిగాథనూ, దేవలోకాన్నీ చిత్రించే మహాకావ్యంలో బాహ్యసంఘటనల ప్రబలమైన చిత్రణం విధిగా వుండనక్కరలేదు. మహాకావ్య విర్మాతకు దివ్య సంకల్పానుసారంగా జరిగిన రోమునగరసృష్టి, భారతీయ కావ్యాలు ప్రతిపాదించే దుష్ట శిష్ట శక్తుల సంఘర్షణమూ, శతాబ్దాల కాల పరిణామ చిత్రణా త్రిలోకాలలో సంచరించే మహర్షి చరిత్రమూ సముచితమైన ఇతివృత్తాలు కాగలవు అనాగరికములైన యుద్ధాలూ, సాహసచర్యలూ మాత్రమే మహాకవి కల్పనకు వస్తువులు కావు. అంతర్దర్శనం ప్రేరేపించిన కవిత్వం ఆత్మగతములైన మహాకావ్యములను సృజిస్తుంది. అనే ఉత్తమమహాకావ్యములకు తార్కాణములు. ఇటువంటి ఉత్తమ మహాకావ్యాలను భవిష్యత్తులో ప్రబలమైన, గంభీరమైన కవికంఠం ఆలాపించగలదని ఆశిస్తున్నాము. అటువంటి మహాకావ్యం ఉన్నతశిఖరాలు అధిరోహించిన భావనతో అత్యంత విస్తారమైన దర్శనంతో మానవాత్మ భవితవ్యమును ఆవిష్కరించగలదు. మానవునిలోనూ విశ్వంలోనూ విరిసే దివ్యతత్వ విధానములనూ, ప్రయోజనములనూ ప్రకటించగలదు.

సావిత్రి ఆంగ్లభాషలో అత్యంత దీర్ఘమైన కావ్యం. ముక్త ఛందస్సులో 23, 813 పంక్తులలో సాగింది. సూక్ష్మదృష్టితోచూస్తే సార్థకమైన జాతీయ కావ్యం. పురాణకాలానికి సంబంధించిన ప్రాచీన కథా వస్తు సంప్రదాయమున్నది. భారతదేశపు ప్రాచీన ఇతిహాసాలు రామాయణ, మహాభారతాల వలెనే ఇహ

లోకంతో పెనవేసుకున్న పరమార్థాన్ని సావిత్రి ప్రతిపాదిస్తున్నది. భారతీయ ఇతిహాసాలు విరక్తినీ, నివృత్తిమార్గాన్నీ ప్రబోధించటం లేదు. మహాభారతంలో కురుక్షేత్ర సంగ్రామరంగంలో అర్జునుడు వైరాగ్యభావ వివశుడైనాడు. శ్రీకృష్ణుని ప్రబోధంవల్ల ఆయన కర్తవ్యపరాయణుడైనాడు. కర్మసన్యాసంకాదు, నిష్కామ కర్మాచరణం బోధించాడు. భూమిమీద ఒక మహోన్నత కార్యనిర్వహణంలో అర్జునుడు నిమిత్తమాత్రుడుగా కర్తవ్యపాలన చేశాడు. నిజమైన ప్రబోధం పొందిన మనిషి అనుసరించదగిన సన్మార్గం అదే. ఈ భూమిమీద ఒక దివ్యమైన కార్య ప్రణాళిక తన రేఖలు విప్పుకుంటున్నది. ఈ ప్రణాళికకు అనుగుణంగా మానవుడు తన అవధులను అధిగమించాలి

"ఈ మర్త్యలోకంలో ఒక మహత్తరజాతి ఆవిర్భవించగలదు. ప్రకృతి సమున్నత సముజ్వల శృంగాలపైన, ఆత్మభూమిలో అతీత మానవుడు జీవిత సామ్రాజ్యానికి సార్వభౌముడై పరిపాలించి ఈ భువిని దివికి సహచరిగా సమానురాలుగా మలచగలడు." ఈ లక్షణంవల్ల అరవిందుని మహాకావ్యం జాతీయపరిధిని అధిగమిస్తున్నది. గూఢరహస్యంగా వున్న మానవునీ విశ్వాన్నీ సమాశ్లేషం చేసుకుంటున్నది. ఆ విధంగా దేశపు అవధులను దాటిన అంశాలు తదితర మహాకావ్యాలలో లేవు అనటం లేదు. సమస్త మానవ భవితవ్యపు ఆవిష్కరణమే సావిత్రి కావ్యంలో ప్రధానమైన కేంద్ర బిందువు.

సావిత్రి మహాకావ్య రచన సాగుతున్న సమయంలో శ్రీ కె. డి. సేథ్నా అరవిందులతో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపిన భాగ్యశాలి. సావిత్రి కావ్య పరమార్థమును గురించి ఆయన చెప్పిన పలుకులతో ఉపసంహారం చేస్తాను.

"భూమిమీద జన్మించిన మానవుని పరిమితమైన ఆత్మ అనంతత్వం కోసం పొందే ఆరాటం మాత్రమే కాక భవిష్యత్తులో పొందబోతున్న సంసిద్ధిని కూడా ఈ కావ్యం వర్ణిస్తున్నది. మార్మికమూ, సాంద్రమూ, జ్యోతిర్మయమూ అయిన ఆ సాఫల్యసిద్ధిని హృదయానికి హత్తుకునే విధంగా మరల మరల అభివర్ణించారు. కాలగమనంలో అనంతత్వస్ఫూర్తిని అత్యంత విస్పష్టంగా విశదంచేశారు. గూఢార్థాలతో తికమకపెట్టే అతివాస్తవకవుల పోకడలో అరవిందులు రచన చేయలేదు అస్పష్టమైన అర్థస్ఫురణచేయటమే అందీ అందని రచనలుచేయటమే ఒకధోరణిగా పెట్టుకున్న ప్రతీకవాదుల పద్ధతిని ఆయన అవలంబించలేదు. ఆయన కవిత ఒక

మహాయోగి దర్శనానికి అక్షరాకారం. మానవులను దిగ్భ్రాంతులనుచేయటం కాదు ప్రబోధించటం ఆశయం. అత్యంత ప్రాచీనమైన భారతీయ ఆధ్యాత్మిక తత్వంలో గాఢంగా వేళ్లు నాటుకున్నప్పటికీ శ్రీ అరవిందులు ఆధునికులలో ఆధునికులు. మనో భూమికనుంచి అతిమానసతత్వాభిముఖంగా మానవుల సమిష్టిచైతన్యం గూఢంగా సాగిస్తున్న పురోగమనాన్ని భావించిన ద్రష్ట ఆయన. సాంఘిక రాజకీయ దౌర్జన్య శృంఖలాలతోపాటు అవిద్యాబంధనలను పటాపంచలు చేస్తూ సమస్త విశ్వమూ భగవంతుని దిశకు పరిణామయాత్ర సాగిస్తున్నదని దర్శించారు. ఒక దివ్యమైన ప్రజాస్వామ్యధర్మం మానవులకు విముక్తి ప్రసాదించటమే అరవిందులు ఆశించిన పరమలక్ష్యం. ఈ ఆశయమే సావిత్రి నోట పలికించారు.

"ఏకాంతమైన స్వాతంత్ర్యం సంతృప్తి నీయదు.
అందరి హృదయాలతో సమన్వయం సాధించిన
నా హృదయానికి అది చాలదు
ఆశయపరిపూర్తికి పరిశ్రమించే విశ్వానికి ప్రతినిధిని నేను
ఆత్మస్వాతంత్ర్యంతోపాటు అందరిస్వేచ్ఛనూ అభ్యర్థిస్తున్నాను నేను.
అందరి స్వేచ్ఛకోసమే నా ఆత్మకు స్వేచ్ఛ.

## అనుబంధాలు

### దివ్యమూర్తి

విచిత్రశిల్పి రచించిన చిత్రరువువంటి వీధి. ప్రమాదరింఖాసంకులతాండవం. ఒదిగి కూచున్నాను. ప్రకృతి నియతిని అతిక్రమించి ఆకస్మికంగా నా తనువును ఆయన దేహం ఆవరించినట్లు స్ఫురించింది.

నా తల పైకి ఎత్తిచూడగా కనబడిందొక మహాశిరస్సు,
వదన మండలాన అమృతత్వ ప్రశాంతి,
సమస్తావకాశమునూ సువిస్తృత సార్వభౌమాధికారంతో
అనుశాసించే సర్వశక్తి సమన్విత వీక్షణలు.
నీలాలకలు గాలిలో తేలుతూ రవిబింబరశ్మిలో లీనమౌతున్నాయి.
ఆయన హృదయంలోనే సకల విశ్వమూ
ఆయనే నేను కాబోలు!
శాశ్వత శాంతి నాలో స్థిరనివాసం
అమృత స్వరూపుని అద్భుతశక్తికి ఆవాసం.
గడిచిపోయింది ఆక్షణం; అంతా యథాప్రకారం;
నిలిచిపోయింది స్మృతిలో ఆ క్షణం అజరామరం.

### పాషాణి

దేవతలకు కొలువైన ఆ నగరంలో, ఒక చిన్నారి దేవాలయంలో శిల్పి చెక్కిన అవయవాలలో అవహించిన దివ్యత్వం చూపింది నా వంక.

సజీవాకృతి ధరించిన అమరశక్తి, దివ్యశక్తి,
సీమారహితరమణీయ మూర్తి.
గాఢ నిద్రాంధకార మగ్నమైన ధరిత్రిలో విశ్వమాత
అవహించింది. సర్వశక్తిమయి, అగోచర, నీరవశక్తి.
మరుభూములలో, ఆకాశంలో, సాగరంలో పరివ్యాప్తమైన
జగజ్జనని మనసులో మరుగుపడి మాట్లాడకున్నది.

నిరవమూ, అగోచరమూ, సర్వజ్ఞమూ అయిన ఆమె మూర్తి
ఆవిష్కరణ రహస్యం గ్రహించేవరకూ ముసుగు తొలగదు.
ఆరాధకుని రక్తమాంసములలో, పాషాణమూర్తి సౌందర్యంలో
నిశ్చల నిశ్శబ్ద సత్యం ఒక్కటే.

## దివ్యముహూర్తం

కొన్ని సమయాలలో దివ్యశక్తి మానవుల మధ్య సంచరిస్తుంది. మన ఆత్మల గంగాలహరి ప్రభుని నిశ్వాస ప్రసరణంతో డోలలూగుతుంది. మరికొన్ని వేళల్లో ఆశక్తి దూరంగా తొలగుతుంది. అప్పుడు మానవులు తమ అహంకారం మీద ఆధారపడి బలమునో, బలహీనతనో ప్రదర్శించుకోవలసివస్తుంది. దివ్యశక్తి ఆవిర్భవించిన సందర్భాలలో స్వల్పప్రయత్నాలు కూడా భవిష్యత్తును మార్చగల మహాఫలితాలను ప్రసాదించగలవు. దైవశక్తి దూరమైన సన్నివేశాలలో స్వల్ప ఫలితాలు సాధించటంకోసం అనల్పమైన ప్రయత్నం అవసరమౌతుంది. ఇటువంటి మహాప్రయత్నాల ద్వారా హోమవేదికల నుంచి స్వర్గానికి ఎగసిన త్యాగధూమం ద్వారా ఈశ్వరానుగ్రహవృష్టి పుష్కలంగా భూమిమీద వర్షించగలదన్న మాట సత్యం. దివ్యముహూర్తం ఆసన్నమైనప్పుడు నిద్రావివశమై, సంసిద్ధంగా లేక, ఆహ్వానదీపికలు వెలిగించకుండా పిలుపు వినలేని స్థితిలో వున్న మానవుడుకాని, జాతికాని నిజంగా అదృష్టహీనులు. శక్తి ఉండికూడా దుర్వినియోగం చేసేవారు, మేల్కొనికూడా అవకాశాన్ని జారవిడిచేవారు అంతకంటే మూడురెట్లు దురదృష్ట వంతులు. వారికి తీరనినష్టమూ ఘోరవినాశనమూ దాపురిస్తాయి.

దివ్యముహూర్తం ఆసన్నమైనప్పుడు ఆత్మవంచనా కపటనాటకమూ, గర్వ పూరితమైన ఆత్మస్తుతీ విసర్జించాలి. ఆత్మను పవిత్రం చేసుకోవాలి. సూటిగా అంతరంగంలోకి చూసి పిలుపును వినగలగాలి. నిజాయితీ లేకపోవటం గొప్ప లోపం. భగవంతుని కన్నుకప్పిగలిగినామని మునువు సంతోషపడివుండవచ్చు. కాని చిత్తశుద్ధిలోపమే కవచంలో కంత అవుతుంది. దెబ్బ అక్కడే తాకుతుంది. చిత్తశుద్ధి లేనివారు తాత్కాలిక విజయం పొందవచ్చును. విజయోత్సాహంతో విర్ర వీగేవేళ దెబ్బ పడితీరుతుంది. అప్పుడు నేలకూలక తప్పదు. పవిత్రతను సాధించిన పిమ్మట అన్నిభయాలూ వదిలివేయండి. దివ్యముహూర్తం ప్రళయ భీకరంగా

ప్రభంజనాలతో అగ్నిజ్వాలలతో సాధారణంగా రావచ్చును. ఈశ్వరుని ఆగ్రహం ద్రాక్షాదళనయంత్రమై అణిచివేయవచ్చును. కాని తన లక్ష్యం స్వచ్ఛమైన దనే విశ్వాసంతో గట్టిగా నిలబడి అన్నిటినీ భరించగలవాడు తప్పక జయిస్తాడు. అటు వంటివాడు పడిపోయినా మళ్ళీ లేచి నిలుస్తాడు. గాలిరెక్కలమీద తేలిపోయినట్లు తోచినా మళ్ళీ తిరిగి వస్తాడు. మీ యోగక్షేమాలకోసం భద్రతకోసం వెనుదీయ కూడదు. ఎదురుచూడని పరిణామాలకు ఇది అదును కదా!

## స్వాతంత్ర్యదినోత్సవ సందేశం

ఆగస్టు 15, 1947 స్వతంత్రభారత జన్మదినం. పురాతనశకం అంతరించి నవయుగం ప్రారంభమౌతున్న శుభ సమయం. మన స్వతంత్ర జీవితాలలో చేసే కృషివల్ల విముక్తజాతిగా సకల ప్రపంచానికీ ప్రాప్తించబోతున్న నవయుగంలో ప్రధాన పాత్ర వహించి మానవుల రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక భవితవ్య రూపకల్పనలో పాల్గొని ఈ దినమును సార్థకం చేయగలము.

ఆగస్టు 15వ నేను జన్మించాను. ఆ దినమునకు ఇంతటి మహత్తర ప్రాముఖ్యం ఏర్పడటం నాకు సహజంగా సంతోషప్రదంగా వుంది. ఇది కాకతాళీ యమైన సన్నివేశం కాదు. నా జీవనారంభంలో చేపట్టిన కార్యక్రమం ఫలప్రదం కావటం ప్రారంభించినట్లు నాకు మార్గదర్శకమై నడిపించిన దివ్యశక్తి ఆమోదముద్ర దయచేసినట్లు భావిస్తున్నాను. నిజంగా ఈనాడు నా జీవితకాలంలో సాఫల్యసిద్ధి పొందగలవని ఆశించినటువంటి విశ్వవ్యాప్తమైన ఉద్యమాలన్నీ ఫలోన్ముఖములై సాఫల్యం పొందబోతున్నట్లు నాకు గోచరిస్తున్నది. ఒకప్పుడు అవి సఫలత పొంద లేని స్వప్నాలుగా తోచినవి. స్వతంత్రభారతం ఈ ఉద్యమము లన్నిటిలోనూ విశేషంగా పాల్గొని నాయకపాత్ర వహించగలదు.

నా ప్రథమస్వప్నం స్వతంత్ర సమైక్యభారతమును సృష్టించగల విప్లవాత్మక మహోద్యమం. ఈనాడు భారతదేశం స్వతంత్రమైనది కాని సమైక్యమును సాధించ లేదు. స్వాతంత్ర్య సాధనా ప్రయత్నంలో భారతదేశం బ్రిటిషువారి విజయానికి పూర్వం వున్న అస్తవ్యస్త పరిస్థితికి దిగజారి ప్రత్యేక రాష్ట్రాలుగా విచ్ఛిన్నమై పోతుందేమో అనిపించింది. అదృష్టవశాన ఆ ప్రమాదం తప్పిపోయిందనిపిస్తున్నది. సంపూర్ణ సమైక్యం రాకపోయినా విస్తృతమైన, శక్తివంతమైన ఏకత్వం నెలకొన

గలదు. రాజ్యాంగ నిర్ణయ సభ అవలంబించిన విజ్ఞతాపూర్వకమైన తీవ్రవిధానంవల్ల దళిత జాతుల సమస్య విభేదాలూ విచ్ఛేదాలూ లేకుండా పరిష్కారం కావచ్చును. పురాతనమైన మతప్రధానమైన హిందూ ముస్లిము విభేదం స్థిరపడిపోయి దేశమును రాజకీయంగా విభజించినట్లు తోస్తున్నది. ఇది తాత్కాలిక పరిష్కారమని ఎంచకుండా దీనినే శాశ్వతవిధానంగా భావించరని ఆశించవచ్చును. ఈ విభాగం ఇల్లాగే కొనసాగితే భారతదేశం బలహీనమౌతుంది. అంగవైకల్యం వస్తుంది. ఆంతరంగిక అశాంతి ఎప్పుడూ తలఎత్తుతూ వుండవచ్చు. పరదేశాలు దండెత్తి రావచ్చు. మరొకసారి దేశమును జయించవచ్చును. భారతదేశపు ఆంతరంగిక అభ్యున్నతీ వైభవమూ నిరోధించబడవచ్చు. ప్రపంచజాతుల మధ్య భారతదేశపు స్థానం బలహీనం కావచ్చు. ఆమె భవితవ్యం దెబ్బతిని నిరాశ కలగవచ్చు. ఇల్లా జరగరాదు. ఈ విభజన రద్దుకావాలి. సహజంగానే ఆ పరిణామం రావచ్చునని ఆశిద్దాం. శాంతి సామరస్యాల అవసరాన్ని అధికంగా గుర్తించి సమిష్టి కార్యాచరణకు ఉద్యమించి అటువంటి ఉమ్మడి కృషికి దోహదం చేయగల మార్గాలను ఏర్పరుచుకోవాలి. ఈ కృషిద్వారా సమైక్యం సిద్ధిస్తుంది. అది ఏ రూపంలో సిద్ధించగలదనే విషయం పరిస్థితులమీద ఆధారపడి వుంటుంది. దాని స్వరూపం కంటే స్వభావమే ప్రధానమైనది. ఏ విధానాలద్వారానైనా, ఏ మార్గంద్వారానైనా ఈ విభజన అంతరించితీరాలి. సాధించగలరు కూడా. భారతదేశపు భవిష్యత్తు సమైక్యం మీదనే ఆధారపడి వుంది.

నా స్వప్నం ఇంకొకటి ఏమంటే — ఆసియాఖండవాసులు జాగృతినీ విముక్తినీ సాధించాలని, మానవ నాగరికతా వికాసంలో ఆసియాఖండం పూర్వపు ప్రధానభూమికను మళ్ళీ నిర్వహించాలని. ఆసియా మేలుకొన్నది. చాలా దేశాలు స్వాతంత్ర్యం సాధించుకున్నాయి. కొన్ని ఇప్పుడు సాధిస్తున్నాయి. ఇంకా పరాధీనాలుగా వున్న దేశాలు సంఘర్షణలద్వారా స్వాతంత్ర్యప్రాప్తి దిశకు పురోగమిస్తున్నాయి. నేడో రేపో చేయవలసిన కృషి కొంత మిగిలివుంది. భారతదేశం తన పాత్రను అందులో నిర్వహించాలి. శక్తిసామర్థ్యాలతో ఆ పాత్రను నిర్వహించటం అప్పుడే ప్రారంభమైనది. విశ్వజాతుల సమ్మేళనంలో ఆమె విశిష్ట స్థానం పొందగల అవకాశాలు కానవస్తున్నాయి.

నా మూడవస్వప్నం విశ్వసమైక్యత. ఉదాత్తమైన, ఉజ్వలమైన రమణీయమైన జీవనం మానవులంతా అనుభవించటానికి ఇది పునాది కాగలదు. మానవలోక సమైక్య ప్రయత్నం సాగుతున్నది భయావహమైన విపత్తులను ఎదుర్కొంటూ

కృషిసాగించే వ్యవస్థ నెలకొన్నది. అసమగ్రమైనదే కావచ్చు. కాని ప్రచోదనశక్తి ప్రబలమై అనివార్యంగా విజయం సాధించగలదు. ఈ రంగంలో కూడా భారతదేశం ప్రముఖ పాత్ర వహించటం మొదలుపెట్టింది. వర్తమాన విషయాలకూ ప్రస్తుతావకాశాలకూ పరిమితంకాని మహత్తర రాజనీతిని పెంపొందించుకోవాలి. భవిష్యత్తును భావించి భావికాలపు కలలను చేరువగా తెచ్చుకోగలగాలి. అప్పుడు త్వరితమైన ధైర్యసమన్వితమైన పురోగతి కలుగుతుంది. లేకపోతే నిదానంగా జంకుతూ ముందడుగు వేయవలసివస్తుంది. ఇప్పుడు జరుగుతున్న కృషికి ఏదైనా మహావిపత్తు అవరోధం కావచ్చు. నిర్మూలనం చేయవచ్చు. అయినప్పటికీ అంతిమ విజయం నిస్సంశయం. ఎందుకంటే సమస్త ప్రకృతి సమైక్యం కోసమే కృషి జరుగుతున్నది. జాతుల మనుగడకు కూడా సమైక్యం అవశ్యం అని స్పష్టమౌతున్నది. అది లేకపోతే చిన్నజాతుల స్వాతంత్ర్యానికి ఏ క్షణంలోనైనా ముప్పు కలగవచ్చు. శక్తియుక్తమైన పెద్దరాజ్యాల భద్రతకు కూడా ఆపద రావచ్చు. కాబట్టి సర్వలోక శ్రేయోదాయకం సమైక్యం. మానవుల స్వార్థమూ, మూర్ఖత్వమూ, అవివేకమూ సమైక్యమును విరోధించవలెననుకోవచ్చు. ఈ శక్తులు కలకాలం విరోధించలేవు. దివ్యానుశాసనమునకూ, ప్రకృతి యత్నమునకూ శాశ్వతంగా అవి అవరోధాలు కల్పించలేవు. బాహ్యమైన ప్రాతిపదిక చాలదు. అంతర్జాతీయ తత్వమూ వైఖరీ, అంతర్జాతీయ వ్యవస్థలూ సంస్థలూ విలసిల్లాలి. అనేక దేశాల పౌరసత్వం పొందే పద్ధతి రావాలి. భిన్నసంస్కృతుల మధ్య యథేచ్ఛగా ఆదాన ప్రదానాలు సాగి, స్వచ్ఛందంగా సంస్కృతులు సమ్మేళనం పొందాలి. యుద్ధ ప్రవృత్తిని విడనాడి జాతీయవాదం సాఫల్యం సాధించగలదు. ఆత్మరక్షణ చేసుకుంటూ స్వీయసంస్కృతిని పరిరక్షించుకుంటూ విశ్వజనీన దృష్టిని అలవరుచుకోవటం అసాధ్యం కాదు. రెంటికీ వైరుధ్యం లేదు. ఈ సత్యం జాతీయవాదం గ్రహించగలదు. వినూతనమైన సమైక్యత్వం మానవజాతికి భారతదేశం ప్రసాదించగల ఆధ్యాత్మికతత్వం. ఐరోపా అమెరికా దేశాలమీద భారతదేశపు ఆధ్యాత్మిక ప్రభావం దినదినం అతిశయిస్తున్నది. ఈ ఉద్యమం ప్రవర్ధమానం కాగలదు. కాలం చేస్తున్న విలయతాండవంలో పాశ్చాత్యులు భారతదేశంవైపు ఆశాపూర్ణ విలోకనాలు ప్రసరిస్తున్నారు. అధికతరమౌతున్నది అటువంటి వారి సంఖ్య. ఆమె ప్రబోధములనే కాక మానసిక ఆధ్యాత్మిక సాధనలను కూడా ఆశ్రయించేవారి సంఖ్య పెరుగుతున్నది.

ఇది నా చరమ స్వప్నం. మానవులకు ఉన్నతమైన, విశాలమైన చైతన్య స్థాయిని ప్రసాదించగల పరిణామ దశ రానున్నది. తన పరిపూర్ణతను గురించి,

ఆదర్శసమాజమును గురించీ కలలు కనటం మొదలుపెట్టినప్పటినుంచీ నేటిదాకా పరిష్కారంకాని జటిల సమస్యలకు సమాధానం సాధించటానికి తలపెట్టాలి. ఇది నా వ్యక్తిగతమైన ఆశ, ఆదర్శం.

అయినప్పటికీ ఈ ఆదర్శం భారతదేశంలో పశ్చిమదేశాలలోనూ క్రాంత దర్శనం అభిలషించేవారిని ఆకర్షిస్తున్నది. ఇతర రంగాలలోకంటే ఇందులో అటం కాలు ఎక్కువ భయావహంగా వుంటాయి. అధిగమించటంకోసమే అవరోధాలు ఏర్పడినవి. దివ్యశక్తి అనుగ్రహంతో అడ్డంకులన్నిటినీ దాటవచ్చును. ఆత్మలోనూ ఆంతరంగిక చైతన్యంలోనూ పరివర్తన కలగటంద్వారా ఈ పరిణామం జరగవలసి వున్నది. కాబట్టి ఈ రంగంలో కూడా భారతదేశం చొరవచూపి ముందడుగువేయాలి. విశ్వపరివ్యాప్తమై విస్తరించనున్న ఈ ఉద్యమానికి భారతదేశం కేంద్రస్థానం కావచ్చు.

భారత విముక్తి దినోత్సవం ఇన్నివిధాల సార్థకత సంపాదించాలని నా ఆకాంక్ష. నా ఆశ సఫలమౌతుందా, అయితే అది ఎంతవరకూ నెరవేరగలదు అనే విషయాలు నవ్యస్వతంత్ర భారతజాతి చేయగల కృషిమీద ఆధారపడి వుంటవి.

# శ్రీ అరవిందుని జీవితంలో ప్రముఖ సంఘటనలు

**1872 :** ఆగస్టు 15, కలకత్తా నగరంలో జననం, డాక్టరు కృష్ణధన్ ఘోషు తండ్రి; గొప్ప దేశభక్తుడూ ఆదర్శవాదీ అయిన రాజనారాయణబోసు పుత్రిక స్వర్ణలతాదేవి తల్లి.

**1879 :** మాంఛెస్టరు నగరంలో డ్రూవెట్ కుటుంబంతో విద్యాభ్యాసంకోసం ఇంగ్లండు వెళ్ళటం.

**1879-83 :** డ్రూవెట్ దగ్గర లాటిన్ భాష నేర్చుకున్నాడు. ఫాక్సు కుటుంబ పత్రికలో పద్యాలు ప్రచురితమైనాయి.

**1884-89 :** లండనులో సెయింటుపాల్సు స్కూలులో చదివి చాలా ముఖ్య బహుమతులు సంపాదించుకొన్నాడు.

**1890 :** కేంబ్రిడ్జి కింగ్సు కాలేజీలో చేరాడు. స్కాలర్‌షిప్ తెచ్చుకున్నాడు. ట్రైపాసు పరీక్షలో ప్రథమభాగంలో ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణత పొందాడు. ఐ.సి.యస్. పరీక్షపోటీలో ఉత్తీర్ణుడైనాడు. గుఱ్ఱపుస్వారీ పరీక్షకు హాజరు కాలేదు. ఇండియన్ మజ్లీసు సంస్థకు కార్యదర్శి అయినాడు.

**1892 :** పద్మం-శూలం అనే రహస్య సంస్థలో సభ్యుడైనాడు. భారత స్వాతంత్ర్య సంపాదనకోసం లండనులో ఏర్పడిన రహస్య సంస్థ అది.

**1893 :** బరోడా గైక్వాడుతో పరిచయం—బరోడాలో వుద్యోగం. స్వదేశాగమనం. ఎపొలోబందరులో అడుగుపెట్టగానే పారవశ్యం కలిగించే ప్రశాంతి ఆవహించటం-మొదటి ఆధ్యాత్మికానుభవం. బరోడాలో ఉద్యోగంలో చేరటం. బొంబాయి నుంచి వెలువడే ఇందుప్రకాశ్ పత్రికలో తీవ్ర రాజకీయాభిప్రాయాలు వెల్లడించే వ్యాసాలు వరంపరగా ప్రచురించటం. భారతీయ సాహిత్యాధ్యయనం.

**1901 :** కలకత్తాలో భూపాల్‌చంద్రబోసు పుత్రిక మృణాళినీదేవితో పరిణయం.

1902-1905 : చాలాసార్లు వంగదేశానికి వెళ్ళి రహస్యవిప్లవ సంస్థలు నెల కొలిపి జాతీయవాదులను సమీకరించటం. యోగసాధన ప్రారంభం.

1905 : వంగదేశ విభజన. బ్రిటిషు వ్యతిరేకభావం తీవ్రం కావటం.

1906 : శలవుమీదవున్న సమయంలో బిపిన్‌చంద్రపాల్ ఆహ్వానించగా బందేమాతరం సంపాదకత్వం; బరోడాలో ఉద్యోగానికి రాజీనామాచేసి కలకత్తాలో జాతీయకళాశాలకు ప్రిన్సిపాలు కావటం—జాతీయ జాగృతికి సంపూర్ణస్వాతంత్ర్యమే పరమలక్ష్యమని ప్రకటించటం — స్వాతంత్ర్యసమరానికి పంచసూత్ర ప్రణాళికను ప్రపంచించటం.

1907 : చరిత్ర ప్రసిద్ధమైన సూరత్‌కాంగ్రెసు సమావేశం—మితవాదులకూ జాతీయవాదులకూ సంఘర్షణ. అరవిందుని అధ్యక్షతక్రింద జాతీయవాదుల ప్రత్యేక సమావేశం. బందేమాతరం పత్రికమీద ప్రభుత్వం దేశద్రోహ నేరారోపణ—ఆరోపణ వీగిపోవటం.

1908 : ఆలిపూరు బాంబుకేసులో అరెస్టు. చెఱసాలలో ఆధ్యాత్మికానుభవ తరంగాలు——

1909 : కారాగార విముక్తి-కర్మయోగిన్, ధర్మపత్రికల సంపాదకత్వం.

1910 : అంతర్వాణి ప్రేరణతో పుదుచ్చేరి చేరుకోటం. కర్మయోగిన్ పత్రికలో ప్రచురించిన వ్యాసాలు దేశద్రోహపూరితంగా వున్నవని ప్రభుత్వం వారంటు జారీచేయటం—పుదుచ్చేరిలో యోగాభ్యాసంలో నిమగ్నులై పోవటం.

1914 : ఆర్య మాసపత్రికలో ముఖ్య రచనలు ధారావాహికంగా ప్రచురణ.

1918 : కలకత్తాలో మృణాళినీదేవి మృతి

1920 : ఆధ్యాత్మికరంగంలో అరవిందులకు సహకరించిన మాత ఆగమనం. ఆశ్రమం అభివృద్ధి.

1926 : అరవిందులు సంసిద్ధి పొందటం. అతిమానసతత్వ ఆవిర్భావం.

1942-45 : మానవ పరిణామానికి హిట్లరు విజయం ప్రమాదకరమని యోగదృష్టితో దర్శించి తన ఆధ్యాత్మికశక్తులను మిత్రరాజ్యాల విజయానికి వినియోగించటం.

1947 : శ్రీ అరవిందుల 75 వ జన్మదినాన భారత స్వాతంత్ర్యసిద్ధి.

1950 : డిసెంబరు 5 వ తేదీన శ్రీ అరవిందుల నిర్యాణం. ఐదు దినాల పాటు భౌతికదేహం శిథిలం కాకుండా తేజరిల్లింది. తొమ్మిదోనాడు మహాసమాధి.

## శ్రీ అరవిందుని కృతులు

అరవిందుని కృతులు ఇప్పుడు ముప్పది సంపుటాలుగా అరవింద శత జయంతి సందర్భాన ప్రచురితమైనవి; పుదుచ్చేరిలో వున్న అరవిందాశ్రమపక్షాన అవి వెలువడినవి. వెలువడిన కాలక్రమానుసారంగా ముఖ్యమైన సాహిత్య సాంఘిక గ్రంథాలను కొన్నిటిని దిగువ పేర్కొంటున్నాము

1895 : మిర్టిలాగీతాలు, ఇతర కవితలు, లక్ష్మీవిలాస ముద్రాశాల, బరోడా.

1896 : ఊర్వశి ,, ,,

1911 : విక్రమోర్వశీ, కుంతలినీ ముద్రాశాల, కలకత్తా.

1915 : అహనా, ఇతర కవితలు. ఆధునిక ముద్రాశాల, పుదుచ్చేరి.

1918 : కర్మయోగి ఆదర్శం. ప్రథమ ముద్రణం అలభ్యం.

1919 : ఉత్తరపరా ప్రసంగం. ప్రవర్తక ప్రచురణశాల, చంద్రనగర్, మానవ సమైక్యాదర్శం. సన్సు ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు.

1920 : యుద్ధమూ, స్వయం నిర్ణయాధికారం. ఎస్.ఆర్.మూర్తి, మద్రాసు.

1921 : యోగమూ, దాని ప్రయోజనాలూ, ప్రవర్తక ప్రచురణాలయం, చంద్రనగర్. ప్రణయం-మరణం. వసంత ప్రెస్, మద్రాసు.

1922 : మానవుడు: ప్రభువా, దాసుడా? ప్రవర్తక ప్రచురణాలయం, చంద్రనగర్. వాణీప్రభు. ఆర్య ఆఫీసు, పుదుచ్చేరి.

1922 : గీతావ్యాసములు (ప్రథమ సంపుటి) వావిళ్ళవారు, మద్రాసు. (ద్వితీయ సంపుటం) ఆర్య. పుదుచ్చేరి.

1924 : మాత ఆర్య సాహిత్యభవన్, కలకత్తా.

1933 : ప్రపంచరహస్యం ఆర్య ప్రచురణాలయం, కలకత్తా.

1935 : యోగదీపికలు శ్రీ అరవిందో గ్రంథాలయం, కలకత్తా.

1936 : యోగపు పునాదులు ఆర్య ప్రచురణాలయం, కలకత్తా.

1939 : దివ్యజీవనం (ప్రథమ సంపుటం) ఆర్య ప్రచురణాలయం, కలకత్తా.

1940 : దివ్యజీవనం (ద్వితీయ సంపుటం) ఆర్య ప్రచురణాలయం, కలకత్తా.

1942 . కావ్యనాటక సంకలనం (రెండు సంపుటాలు) శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి.

1946 : అగ్నిసూక్తవ్యాలు శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి

1949 : మానవ చక్రభ్రమణం ,

1950 : సావిత్రి (ప్రథమభాగం) ,

1951 : సావిత్రి (ద్వితీయభాగం) ,,

1953 : ఎనిమిది ఉపనిషత్తులు, భారతీయ సంస్కృతికి పునాదులు శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి.

తనను గురించీ మాతను గురించీ శ్రీ అరవిందుని ప్రవచనాలు శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాసంస్థ, పుదుచ్చేరి.

1955 : యోగసమన్వయం ,,

వేదమును గురించి ,,

1956 . విద్యాపతి గీతాలు శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి.

1957 : ఇలియన్ ,,

1958 . రోడోగూన్ ,,

1959 : బసోరా వజీరులు ,,

1951 లో భారత ప్రభుత్వం వారిచే స్థాపించబడిన సాహిత్య అకాదెమీ పాలనాస్వేచ్ఛగల జాతీయ సంస్థ. వివిధ భారతీయ భాషలకూ, రాష్ట్రాలకూ విశ్వవిద్యాలయాలకూ చెందిన ప్రతినిధులుగల జనరల్ కౌన్సిల్ ఈ సంస్థ విధానాలను రూపొందిస్తుంది. అకాదెమీ మొదటి అధ్యక్షులు శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ.

భారతీయ భాషలలోని సాహిత్య కార్యక్రమాలను ప్రోత్సహించి సమన్వయ పరిచేందుకూ, ఒక భారతీయ భాషలోని ఉత్తమ సారస్వతమును అనువాద రూపంలో అన్య భారతీయ భాషలవారికి అందించేందుకూ అకాదెమీ కార్యక్రమం ఉద్దిష్టమైనది.

అకాదెమీ ప్రచురణలు ముఖ్యంగా భారతీయ భాషలకే పరిమితం. కాని భారతీయ రచయితలకూ, వారి రచనలకూ సంబంధించిన మౌలిక విషయాలను తెలియజేసేందుకు ఆంగ్లంలో గ్రంథ ప్రచురణ జరుగుచున్నది.

**సాహిత్య అకాదెమీ**
రవీంద్ర భవన్. న్యూఢిల్లీ-1
ప్రాంతీయ కార్యాలయములు :
మద్రాసు-6. కలకత్తా-29. & బొంబాయి 14